35th Year of Publication




మార్చి - 1990

## సాహితీ సుధ

క్షీరము మున్న నీటి కొసగెన్ స్వగుణంబులు దన్న జేరుటన్
క్షీరము తప్తమౌట గని చిచ్చుబికెన్ వెతచే జలంబు దు
ర్వార సుహృద్విపత్తి గని వహ్ని జొరం జనె దుగ్ధమంతలో
నీరము గూడి శాంతమగు నిల్చు మహాత్ముల మైత్రి యీ గతిన్

—భర్తృహరి

*

ఎప్పుడు సంపద గలుగును - నప్పుడ బంధువులు వత్తు రది యెట్లనం
దెప్పలుగ జెఱువు నిండిన - గప్పలు పదివేలు చేరు గదరా సుమతీ

కూరిమి గల దినములతో - నేరము లెన్నడును గలుగ నేరవు మఱి యా
కూరిమి విరసంబైనను - నేరములే తోచుచుండు నిక్కము సుమతీ

కమలములు నీట బాసిన - గమలాప్తుని రశ్మి సోకి కమలిన భంగిం
దమ తమ నెలవులు దప్పిన - దమ మిత్రులు శత్రులౌట తథ్యము సుమతీ

—సుమతీ శతకం

'జగతి' - 2, కచేరీ రోడ్, మైలాపూర్, పి బి 2922, మద్రాసు - 600004
ఫోన్: 76697- చందా 2 సంగులకు రు. 45-00 – 5 సంగులకు రు. 100-00. జీవిత చందా రు. 300-00. పాట్రన్ - రు. 1000-00. విదేశాలకు 2 సంగులకు రు. 100-00

ముఖచిత్రం: జమున, ఎమ్.పి.

# నిమ్మతోనాలు

ఏమిటండీ చెట్లు అలా నరికిం చేస్తున్నారు. పచ్చటి చెట్టు కొట్ట కూడదని కదా మనవాళ్లు చెప్పేది' - అంటూ సుబ్బారాయుడు విచారం వెలిబుచ్చాడు.

'నాకూ బాధగానే వుంది - ఏం చేయమంటారు ? మంత్రిగారి హెలి కాప్టర్ దిగేందుకు స్థలం చదును చేయాలంట' - అని సంజాయిషీ చెప్పాడు శంకర్రావు.

'మంత్రిగారెందుకు విజయం చేస్తున్నట్లు ?' - ప్రశ్నించాడు సుబ్బా రాయుడు.

'వన మహోత్సవానికండీ - చెట్లు నాటడానికి !'

—వి శ్రీనివాసరావు
కోరుకొల్లు

తల్లీ కూతురూ రెండవ అంతస్థు బాల్కనీలో నుంచుని, రోడ్డు వంక చూస్తున్నారు. ట్రాఫిక్ పల్చగా ఉంది. తిన్నది నెమరువేసుకుంటూ పేవ్‌మెంటు మీద నిలబడి వుంది ఒక ఆంబోతు. ఒక ఆవు అటు వైపుగా వస్తూ ఆంబోతు కనిపించగానే గబగబా అవతల వైపుకి వెళ్లి పోయింది.

'అమ్మా, ఆవుకెందకంత భయం - అలా పారి పోయింది ?" - అని అడిగింది పన్నెండేళ్ల జలజ, తల్లిని.

'పిపీలకాది బ్రహ్మ పర్యంతం ఒకటే కథ'

'అంటే ఏమిటమ్మా ?' అని ప్రశ్నిం చింది జలజ.

'ఆడ మగా ప్రతి జీవరాసిలోనూ ఉంటుంది ఆడది తప్పించుకు తిరుగుతుంది' అని తల్లి చెప్పేసరికి, అంతా అర్థమైపోయినట్టు మొహం పెట్టింది జలజ.

—బులుసు శారద
కలకత్తా-53

రమణా, ఏమిటలా సన్నబడిపోతు న్నావ్ నానాటికి ? సరిగ్గా అన్నం తినటం లేదా ? డాక్టర్ని కన్సల్ట్ చేశావా ?' - అని ప్రశ్నించాడు ప్రతాపరావు.

రమణమూర్తి సమాధానం చెప్పే లోపున సుదర్శనం కల్పించుకొని, 'తను తీసుకొన్నగోతిలో తనే పడ్డాడు' - అన్నాడు.

'సామెతలు మానేసి అసలు సంగ తేమిటో చెప్పు' -అన్నాడు ప్రతాప రావు.

'పెళ్లి చేసుకోకు, నాయనా, అందులో చాలా కష్టాలు వున్నాయి - అని మేము చెవినిల్లుకట్టుకు బోధించినా విన్నాడు కాదు - ఇప్పుడు అనుభవిస్తు న్నాడు' - అని తేల్చాడు సుదర్శనం.

'నువ్వు చెప్పేది నాకర్థం కావడం లేదు'.

'వెనక హాయిగా హోటల్లో భోం చేసేవాడు, ఇప్పుడు రెండూ పూట్లా భార్యకు వొండి పెట్టవలసివస్తోంది. ఇంటా బయటా చాకిరీతో చిక్కి శల్యమయాడు'.

సుదర్శనం చెప్పేది నిజమా అని ప్రతాపరావు అడిగేందుకు, రమణ మూర్తి అక్కడ వుంటేగా - మెల్లగా జారుకున్నాడు.

—వై భాస్కరరావు
కొణకంచి

ఏ కార్డు కైనా కేజీ పంచదార ఇస్తా నన్నావ్ - ఇప్పుడు ఇవ్వనంటు న్నావ్ - నేనెవరో తెలుసా, యివ్వక పోతే టాపులేపేస్తాను జాగ్రత్త - అని బెదిరించాడు రౌడీ రంగడు.

చౌక ధరలు దుకాణం గుమాస్తా యిలా మనవి చేసుకున్నాడు: 'రంగయ్య బాబూ, ఏ కార్డు కైనా కేజీ పంచదార యిస్తామన్నమాట నిజమే! ఆకు పచ్చది గాని పసుపు పచ్చదిగాని రేషన్‌కార్డు తీసుకురా, యిస్తాము - అంతేగాని, పోస్టుకార్డుకి కాదు.'

—చామర్తి హనుమంతురావు
చింతలూరు

రామనాధమూ, అతని భార్యా తమ వివాహ స్వర్ణోత్సవ (50 ఏళ్లు) వేడుక ఎంతో ఘనంగా జరుపుకుంటు న్నారు. పార్టీకి వచ్చిన అందరితోనూ సరదాగా నవ్వుతూ చలాకీగా కబుర్లు చెబుతున్నారు.

గోపాలరావు రామనాధాన్ని పక్కగా పిలిచి అడిగాడు; 'సార్' నాకు పెళ్లయి అయిదేళ్లయింది - చీటికి మాటికీ పోట్లాడుకుంటూ వుం టాము. మీరు 50 ఏళ్లు యింత అన్యోన్యంగా ఎలా వుండగలిగారో ఆ కిటుకు చెప్పండి - పుణ్యం ఉంటుంది.'

'ఓస్ - అదా ? నేనెప్పుడూ టూర్ల మీదనే వుండేవాడ్ని కద !'

—డి సత్యమూర్తి
వాడ్రేవుపల్లి

# పాఠకుల తీర్పు

మిత్రులు శ్రీ చందూర్ గారికి : నమస్కారములు. జనవరినెల 'జగతి' అందింది. నా చిట్టి కురుల ఫొటో ఎక్కడ సంపాదించారో చిత్రంగావుంది. నాగురించి రాసిన నాలుగు పరిచయ వాక్యాలు ఎంతో బాగున్నాయి. ప్రతి నెలా మీ 'జగతి' అందుకోగానే ముందు నేను 'డైరీ' చదువుతాను - అంత ఆసక్తికరంగా వుంటున్న శీర్షిక అది. మీ రచనలో చలన చిత్రగుణం ఉంది. అందుకే అది అలా చదివి స్తుంది. చాలా సంతోషం.

—సి నారాయణరెడ్డి
హైదరాబాదు-4

జనవరి 'జగతి'లో బెజవాడ గోపాలరెడ్డిగారి ఆత్మావలోక ఉప న్యాస భాగాలు చదివి ఎంతో ఆనందిం చాను. వివిధానేక అనుభవాలను ఆయన ఎంతో ఉన్నతంగా ఉదాత్తంగా విన మ్రతతో సమరస భావంతో మనసుకి హత్తుకొనేటట్టు చెప్పారు. నా అభి నందనలు.

—యన్‌జి రంగా
న్యూఢిల్లీ-1

చందూర్‌గారికి: నమస్కారములు. జ్ఞానపీఠ్ అవార్డు గ్రహీత సి నారా యణరెడ్డి ముఖచిత్రం 'జగతి' కి వన్నె తెచ్చింది. కేసరిగారి పర్యటన వివరాలు ఎంతో చక్కగా ఉంటు న్నాయి. త్వరలో మరొక కొత్త సీరి యల్ కథ ప్రారంభించగలరని ఆశిస్తు న్నాము.

—సి నాగేశ్వరరావు
సికింద్రాబాదు-3

శ్రీయుత చందూర్‌గారికి : ఒక సారెప్పుడో చాలాకాలం క్రితం శ్రీరాం షాగారు మీగురించి ఎంతో ఘనంగా చెప్పారు. అప్పటినుంచీ మీ రచనలు సంపాదించి చదవడం ప్రారంభించాను. చందూర్‌గారు మాలాంటి కొద్దిమందికే తెలుసు. కాని, మాలతీ చందూర్ అంటే తెలియని తెలుగు పాఠకులు సాధార ణంగా వుండరేమో!

—సిహెచ్ మల్లిబాబు
దుమ్ముగలిండెం

శ్రీ చందూర్‌గార్కి : నమస్కారం. 'జగతి' ప్రతి సంచిక ఎంతో విజ్ఞాన దాయకంగా ఆసక్తికరంగా వుంటుంది మాలతి గారికి నమస్కారములు. ఆశీ వాదాలతో,

—ఆలూరి విజయలక్ష్మి
కాకినాడ-1

## వెన్నెల కెరటాలు

## ఫోర్ట్ విలియం

ప్లాసీ యుద్ధంలో విజయం తర్వాత బ్రిటిష్‌వారు తమ సామ్రాజ్యాన్ని ఇండియాలో వ్యాపింప జేయటానికి, నానాపాట్లూ పడ్డారు. 1773 లో కలకత్తా బ్రిటిష్ ఇండియాకు అధికార రాజధాని అయింది. వారన్ హేస్టింగ్స్ 'ప్రెసిడెన్సీ ఆఫ్ ఫోర్ట్ విలియం ఇన్ బెంగాల్' కు మొదటి గవర్నర్ జనరల్ అయ్యాడు. ఈకోట 140 సంవత్సరాలు సార్వభౌమత్వాన్ని అనుభవించింది, 1911 లో రాజధాని ఢిల్లీకి మారినప్పటి వరకూ.... తమ సామ్రాజ్యం నిలదొక్కుకొనేందుకు దృఢమైన మరొక కోటకి గోవిందపూర్ గ్రామం తగిన ప్రదేశం అని సైనిక నిపుణుడు క్లయివ్ గమనించాడు. ఈ కోట అష్టభుజాకారంలో వుంటుంది. అయిదు భుజాలు మైదానం వైపూ, 'ప్లాటో' రూపానికి బదులు ఇంజనీర్లు దీనికి 'గిన్నె' ఆకారాన్నిచ్చారు. దీనివల్ల బలవంతుడైన శత్రువుకి ఇది కనపడదు. ఫలితంగా దీనిపై శతఘ్నులతో దాడి వేయటం సులభంకాదు. కోట చుట్టూ 15 మీటర్ల వెడల్పూ, 9 మీటర్ల లోతూవున్న కందకం వుంది. నది నుంచి వచ్చే ఒక కాలువతో దీనిని నింపవచ్చును.

-మేజర్ అగస్టీన్
'సైనిక సమాచార్'లో

## పుట్టగొడుగు

పుట్టగొడుగుల పెంపకం గురించి చాలా మందికి సరియైన అవగాహన లేదు. ఇదేదో పెరట్లో పెంచేవనో, ఎకరాల నేలలో నాటితే పంట వస్తుందనో అనుకుంటారు. కాని ఇది పూర్తిగా ఇండోర్ క్రాప్ అంటే మనం నివసించే ఇంటిలో కాని వేరేగాకాని ఒక గదిని ఇందుకోసం కేటాయించుకుని అందులో పండించవచ్చు. గది కిటికీలు తలుపులు మూసివేసి చీకటిగా చేయాలి. ఉష్ణోగ్రత తగ్గించి విత్తనం నాటిన గడ్డి బెడ్స్‌ని ఆ గదిలో అమర్చుకున్న చెక్క స్టాండులో పేర్చాలి, ఆ గదిలోకి అందరూ ఎప్పుడంటే అప్పుడు వెళ్ళకూడదు. పరిశ్రమ - శిక్షణా కేంద్రంలో విత్తనం తయారుచేసుకోవటం దగ్గర నుంచి కాపు తీయటం వరకు పూర్తి శిక్షణ ఇస్తున్నారు. శిక్షణా కాలం 30 రోజులు మాత్రమే శిక్షణ.

—కె విజయలక్ష్మి
'అన్నదాత'లో

# పాతికేళ్ల నాటి పిక్చర్

పోయిన సంవత్సరం (1964) ఫిలిమ్ నిర్మాణంలో మద్రాసుది ప్రధమస్థానం. 131 చిత్రాలు యిక్కడ విడుదలైతే, బొంబాయిలో 129, కలకత్తాలో 43. సాంఘికాభ్యుదయం లో ఫిలిమ్‌కి గల గురుతర బాధ్యత గుర్తించిన భారత ప్రభుత్వం, 1961 అగస్టులో పూనె నగరంలో ఫిలిమ్ ఇన్‌స్టిట్యూట్ స్థాపించింది. ఈ విద్యా సంస్థ యువతీ యువకులకు, చిత్ర నిర్మాణానికి చెందిన వివిధ శాఖలలో శిక్షణనిస్తోంది. సంగీతానికి, నాట్యానికి సాధన కావాలిగాని, సినిమాల్లో నటించేందుకు అదృష్టం వుంటేచాలు - అనుకొనే దురభిప్రాయం చాలామంది లో ఉంది. మొన్నీమధ్య బొంబాయి లోని ఫిలిమ్ నిర్మాతలు కొత్తముఖాల కోసం చేసిన ప్రకటనకు, పదివేల అప్లికేషనులు వచ్చాయి. అందులో ఎన్నిక కాబడ్డ ఏడుగురిలోను నలుగురు ఈ ఇన్‌స్టిట్యూట్ విద్యార్థులవటం, ప్రిన్సిపాల్ జగత్‌మురారి పడ్డ శ్రమకు సత్ఫలితమని సంతోషించదగ్గ విషయం. విద్యాభ్యాసంలో ఒక భాగంగా వారు తయారుచేసిన 'ఏక్ తా పత్తర్' అనే మూడురీళ్ల చిత్రం ఎంతో కళాత్మకంగా రమ్యంగా ఉంది. 'మనిషికి ఎంత డబ్బువుంటే చాలు ననిపిస్తుంది?' అనే ప్రశ్నకు తాత్విక సమాధానం ఈ చిత్రం - 'మనిషికి ఎంత నేల కావాలి?' అనే టాల్‌స్టాయ్ కథలా, మరొక దృక్కోణం నుంచి (డైరీ: 1965 అక్టోబరు 15).... విల్లింగ్స్ థియేటర్‌లో ఫిలిమ్స్ డివిజన్ వారు పత్రికా ప్రతినిధులకు కొన్ని డాక్యుమెంటరీలు చూపించారు. కాశ్మీరు విషయంలో పాకిస్థాన్ 1947లో చేసినట్లే 1965 లో కూడా చేయడం చూపారు. ఆనాడు జఫ్రుల్లాఖాన్ తన కేమీ తెలియదని అన్నట్లే ఈనాడు భుట్టో అంటున్నారు: అయితే, భారత సైన్యానికి వశమైన మర తుపాకులూ మందుగుండు సామానుపైగల గుర్తులు ఈ అబద్ధాలను అవహేళన చేస్తు న్నాయి. పాల సరఫరాకు సంబంధించిన చిత్రం, సహకార రంగానికి (కో ఆపరేటివ్ సెక్టార్) గల తక్షణా వశ్యకతను తెలుపుతోంది. 'టెక్నికల్ లీడర్‌షిప్ ఆఫ్ టుమారో' (Technical Leadership of Tomorrow) అనే డాక్యుమెంటరీ ఆధునిక సైనిక పంక్తు లకు సిగ్నల్‌కోరూ ఇంజనీరింగు కోరూ - గాలీ, నీరూ వంటివని సవివరణతో చూపుతోంది.

—యన్నార్ చందూర్ సమీక్ష
'జగతి' - నవంబరు 1965

# మానవ ప్రగతి

## 'కోస్పాస్ - సర్సాత్'

భూమిపైన ఆపదలో చిక్కుకున్న వారిని రక్షించడానికి ఇప్పుడు ఆకాశం నుంచి అయిదు ఉపగ్రహాలు నేల మీద ప్రతి అంగుళాన్ని పట్టిపట్టి చూస్తున్నాయి. రాత్రింబగళ్ళు భూమిపైన 'నిఘా' వేసి వుంచుతున్న ఈ ఉపగ్రహాలలో మూడు అమెరికాకు చెందినవి. కాగా మిగతా రెండు సోవియెట్ యూనియన్‌కి చెందినవి. ఇవి సముద్రంలో ఆపదలో చిక్కుకున్న నౌకలను కనుగొనడంతోపాటు భూమిపైన మారుమూల ప్రాంతాలలో కూలిపోయిన విమానాల జాడను కూడా తెలియజేస్తాయి. ఆపదలో చిక్కుకున్న నౌకల నుంచి, లేదా కూలిపోయిన విమానాలనుంచి ప్రమాద సంకేతాలను ఉపగ్రహం అందుకుని వాటిని వెంటనే ఒక అంతర్జాతీయ వ్యవస్థలో భాగంగా వున్న భూకేంద్రాలకు పంపిస్తుంది. మరుక్షణం ఆ భూకేంద్రాలు సదరు విపత్తు ఏర్పడిన ప్రాంతాలకు రక్షక దళాలను హుటాహుటిన తరలిస్తాయి. ఈ అయిదు ఉపగ్రహాలలో మొదటి దానిని 1982 లో ప్రయోగించారు. అప్పటి నుంచి ఇప్పటివరకు ఈ ఉపగ్రహాలు ప్రపంచ వ్యాప్తంగా అనేక ప్రాణులను కాపాడగలిగాయి. గత జనవరిలో ఇల్లినాయ్‌లో రెవరెండ్, వాల్ష్ అనే 81 ఏళ్ల కాథలిక్ మతాచార్యుడు నడుపుతున్న చిన్న విమానం ప్రమాదవశాత్తు ఒక లోయలో కూలిపోయింది. ఆ సమయంలో విమానం నుంచి 'ఆటోమాటిక్'గా వెలువడిన ప్రమాద సంకేతాన్ని ఆకాశంలో సుమారు వెయ్యి కిలోమీటర్ల ఎత్తున పరిభ్రమిస్తున్న ఒక సోవియట్ ఉపగ్రహం అందుకుని వెంటనే దానిని ప్రమాద స్థలానికి సమీపంలోని స్కాట్ వైమానిక దళ స్థావరానికి చేరవేసింది. దానివల్ల ఆ తర్వాత కొద్దిసేపటిలోనే ఒక రక్షక బృందం విమానం కూలిపోయిన ప్రాంతానికి చేరుకుని గాయపడిన మతాచార్యుని ఆస్పత్రికి తరలించ గలిగింది. ఈ మధ్యనే మెక్సికన్ తీరంలో రెండు నౌకలను ఒడ్డుకు తేవడానికి వెళ్లిన మరొక నౌకలో అగ్ని ప్రమాదం సంభవించింది. వెంటనే

నౌకలోని 12 మంది సిబ్బంది హడా వుడిగా ప్రమాద సంకేతాన్ని పంపించి ఆ తర్వాత ఒక 'లైఫ్ బోట్'లో ఎక్కి మంటలు చెలరేగిన నౌకకు దూరంగా వెళ్లిపోయారు. అయితే ప్రమాద సంకేతాన్ని పంపించేటప్పుడు వారు సముద్రంలో తామున్న ప్రదేశం ఉనికిని సరిగా తెలియచేయలేక పోయారు. దానితో వారినుంచి వెలువడిన ప్రమాద సంకేతం ఆధారంగా బయల్దేరిన రక్షణ బృందం పసిఫిక్ మహాసముద్రంలో మరొక ప్రాంతంలో గాలింపు చర్యలు చేపట్టింది. తాము తమ ఉనికిని గురించి పొరపాటు సమాచారం పంపినట్టు తెలియని నౌకా సిబ్బంది 'లైఫ్ బోట్'లో నిస్సహాయంగా కూర్చొని రక్షణ బృందం కోసం నడి సముద్రంలో పడిగాపులు పడసాగారు. ఈ పరిస్థితిలో ఆకాశం నుంచి 'చూస్తున్న' ఒక అమెరికన్ ఉపగ్రహం, వారు సముద్రంలో ఖచ్చితంగా ఏ ప్రాంతములో వున్నదీ భూకేంద్రానికి తెలియజేసింది. ఆ వెంటనే ఒక రక్షణ విమానం హుటాహుటిన బయల్దేరి వెళ్లి సముద్రంలో చిక్కుకుపోయిన ఆ 12 మంది నౌకా సిబ్బందిని రక్షించింది. అంతరిక్షం నుంచి ఉపగ్రహాల ద్వారా సాగే ఈ అన్వేషణ, రక్షణ సహాయ కార్యక్రమాన్ని అధికారికంగా 'కోస్పాస్ - సర్సాత్' అని పిలుస్తున్నారు. 'కోస్పాస్' అనేది రష్యన్ శబ్దం కాగా 'సర్సాత్' అనేది ఆంగ్ల శబ్దం. ఈ కార్యక్రమంలో అమెరికా, సోవియట్ యూనియన్‌లకు పెక్కు ఇతర దేశాలు కూడా సహకరిస్తున్నాయి. దీని కోసం కెనడా, ఫ్రాన్స్‌లు ప్రత్యేకమైన ప్రసార, గ్రహణ పరికరాలను తయారు చేస్తున్నాయి. బ్రిటన్, నార్వే, బ్రెజిల్‌లు, అమెరికా, సోవియట్ యూనియన్, ఫ్రాన్స్, కెనడాలతో పాటు.... ఉపగ్రహాలనుంచి వచ్చే సమాచారాన్ని విని, విశ్లేషించే భూకేంద్రాలను నిర్వహిస్తున్నాయి. ఇండియా, ఆస్ట్రేలియాలు కూడా త్వరలో ఇట్టి కేంద్రాలను ప్రారంభిస్తాయని, ఆ తర్వాత వెనెజులా కూడా ఇదే మార్గాన్ని అనుసరిస్తుందని భావిస్తున్నారు. ఈ కార్యక్రమం క్రింద రోదసి నుంచి పని చేస్తున్న అమెరికన్, సోవియట్ ఉపగ్రహాలు ధృవకక్ష్యకు సమీపంలో పరిభ్రమిస్తున్నందున భూమి నంతటినీ రోజుకు రెండు పర్యాయాలు నిశితంగా 'చూడ' గలుగుతున్నాయి. మూడు అమెరికన్ ఉపగ్రహాలు భూమికి 832 కిలోమీటర్ల ఎత్తున పరిభ్రమిస్తూ 102 నిమిషాల కొకసారి భూమి చుట్టూ తిరుగుతుంటే రెండు సోవియట్ ఉపగ్రహాలు భూమికి వెయ్యి కిలోమీటర్ల ఎత్తులో పరిభ్రమిస్తూ తిరగడానికి భూమిచుట్టూ 105 నిముషాల వ్యవధి తీసుకుంటున్నాయి. ఇప్పుడు అమెరికాలో సుమారు 250,000 విమానాలలో అత్యవసర సమయంలో ప్రమాద సంకేతాలు పంపగల 'బాటరీ పవర్డ్ రేడియో బీకన్స్' అమర్చివున్నాయి. అలాగే 7,000 కి పైగా అమెరికన్

నౌకలలో (వాహ్యాళికి ఉపయోగించే బోట్లు, చేపల పడవలతో సహా) కూడా ఇట్టి 'బీకన్స్' వున్నాయి. ఇవి ఆప దలో చిక్కుకున్న మరుక్షణమే ప్రమాద సంకేతాలు పంపడం ప్రారం భిస్తాయి. ఆ సంకేతాలను అంతరిక్షం లోని ఉపగ్రహాలు అందుకుని మళ్లీ వాటి నివెంటనే ఆయా ప్రాంతాలలోని భూకేంద్రాలకు రిలే చేస్తాయి.

## ఏనుగు దంతాలు

దంతాల కోసం ఏనుగుల్ని వధిం చడం వల్ల గత 10 ఏళ్లలో ఆఫ్రికన్ ఏనుగుల సంఖ్య 609,000కి తగ్గి పోయింది. ఇది ఏనుగుల సంఖ్యలో సుమారు 50 శాతం తగ్గుదల కావడం ఆందోళకరమైన అంశం. కాగా ఈ పరిస్థితిని నివారించి ఆఫ్రికన్ ఏనుగుల తగ్గుదలను అరికట్టేందుకై ఏనుగులకు సంబంధించిన దంతాలు, మాంసం, చర్మం వర్తకాన్ని నిషేధించాలని 103 దేశాలకు సభ్యత్వం గల 'సి ఐ టి ఇ ఎస్' అనే అంతర్జాతీయ సంస్థ నిర్ణయించింది. ఈ అంతర్జా తీయ సంస్థ ఇటీవల స్విట్జర్లాండ్‌లోని లాసేన్‌లో సమావేశం జరిపింది. సమావేశంలో పాల్గొన్న అమెరికా ప్రతినిధి ఈ నిర్ణయాన్ని హర్షించారు. ఆఫ్రికన్ ఏనుగుల దంతాల దిగు మతిని, అమెరికా, కెనడా, యూరప్ సమాజం, జపాన్ మొదలైన దేశాలు విధించిన నిషేదం వల్ల ఈ దంతా లకు ప్రపంచ మార్కెట్ 75 శాతానికి తగ్గిపోయింది. ఏనుగులను పరిరక్షించే కృషికి తోడ్పడేందుకై అమెరికా అంతర్జాతీయ అభివృద్ధి సంస్థ, 20 లక్షల డాలర్లకు పైగా మొత్తాన్ని 1990 ఆర్థిక సంవత్సరంలో కేటాయిస్తున్నది. ఏనుగు దంతాలకు విపరీతమైన గిరాకీ ఏర్పడడం వల్ల వాటి ధర కిలోగ్రాము ఒక్కింటికి 200 డాలర్లు వరకు పెరిగి పోయింది. అందువల్ల ఏనుగుల్ని మట్టుపెట్టడం ఎక్కువైంది. ఇప్పుడు ఈ వర్తకాన్ని నిషేధించడం వల్ల గిరాకీ తగ్గి ఏనుగుల్ని కాపాడానికి అవకాశం ఏర్పడింది. ☼

## ఈ మధ్య అందినవి :

బహుముఖ ప్రజ్ఞాశాలి - బూర్గుల .... డి రామలింగం.... తెలుగు విశ్వ విద్యాలయం, హైదరాబాదు - 4.... రు. 10-00

దృశ్యం - వచన కవితా సంపుటి.... సాదనాల వేంకట స్వామినాయుడు, రాజమండ్రి - 3 .... రు. 15-00

Yogi Vemana - 101 English Verses... Sreenivasudu ...Padmavathi Publishing, Madras - 17 ... Rs. 5-00.

అందుకున్నవన్నీ గాకపోయినా కొన్నిటి సమీక్షలు ముందు ముందు సంచికలలో వెలువడుతాయి.

# చిత్రజగతి సమీక్ష

## జెఆర్‌రార్

## 'మంచివారు - మావారు'

ప్రకాష్ (రాజశేఖర్), సుమతి (జీవిత) ఒకరికొకరై బతుకుతున్న దంపతులు - తలిదండ్రుల సరాగాలకు తను కళ్లు మూసుకుంటున్నానని చెబుతాడు ఏడేళ్ల తనయుడు. అబ్బాయిని పేకముక్కలతో చెడగొడుతున్నారని ఆమెగారి కంప్లయింటు. బాంకు మేనేజర్ ప్రకాష్ సంసారం హాయిగా సాగిపోతూ వుండగా, ఒక రేణుక తన నగలు భద్రపరుచుకొనేందుకు లాకర్ కోసమై ఆ బాంకుకి వస్తుంది. చీరె కనిపించగానే చిత్తజుని బారికి లోనయే అకవుంటెంట్ (సుధాకర్), ఆమెగత చరిత్ర తవ్వి తెలుసుకు, భర్త ఈ మధ్యనే అనుమానాస్పదమగు పరిస్థితులలో మరణించాడనీ, ఆమె వద్ద లక్షలు మూలుగుతున్నాయనీ, పది పది హేను లక్షలు డిపాజిట్ అడగమనీ ప్రకాష్‌ని ప్రోత్సహిస్తాడు. ఇద్దరూ డిపాజిట్ అడిగేందుకు ఆమె ఇంటికి వెళ్లి, ఆ వైభవమూ, సంపద, ఈత కొలనూ చూసి విస్తుపోతారు. 'దానిదేముంది ? మా లాయరుతో చెప్పి మీకు పది హేను లక్షల డిపాజిట్ ఇప్పిస్తాను' అంటుంది; ఆ చెక్కు తనే స్వయంగా తీసుకువచ్చి యిస్తుంది ప్రకాష్‌కు. ఇతను అపర శ్రీరామచంద్రమూర్తి అవటంవల్ల, ఆమె మౌనఘోష, మూగభాష తెలుసుకోలేకపోతాడు. ఒకవేళ చూచాయగా తెలిసినా, రేణుక ఐశ్వర్యానికి, అందానికి భయపడతాడు. ఇనస్పెక్షన్ కారణంగా మామగారి షష్టిపూర్తికి వెళ్లలేకపోయిన ప్రకాష్, పార్టీ నుంచి యింటికి వస్తూండగా, పెద్ద వర్షంపడి, కారు చెడిపోతుంది. అదే పార్టీలో తటస్థపడ్డ రేణుక, తమ భవనానికి పట్టుకుపోయి, వేడినిచ్చే పానీయంతో 'ఎక్సయిటింగ్ మూవీ' చూపించి, ఆ పైన అతనిని 'సెడ్యూస్' చేస్తుంది. తెల్లరి లేచాక 'జరిగినదానికి అనవసరంగా విచారపడకండి - మనం చిన్నపిల్లలంకాదు - నాకు మీరంటే ఇష్టం' అని జంకు గొంకులు లేకుండా చెబుతుంది. అయితే, అతని ప్రేమను గెలుచుకోవాలనే ప్రయత్నంలో, నరరూప రాక్షసిగా మారి, అంత మొందుతుంది. దర్శకత్వం : ఐవి శశి. ❋

# కొత్త పుస్తకాలు



బహుముఖ ప్రజ్ఞాశాలి బూర్గుల - బూర్గుల రామకృష్ణారావు జీవిత చరిత్ర. రచన : డి రామలింగం. ప్రచురణ : తెలుగు విశ్వవిద్యాలయం, హైదరాబాదు - 4. వెల: రు 10-00

'మా ఉద్యమం కేవలం విశేషముగ గ్రంథాలయముల మూలమున విజ్ఞానం వ్యాపింప చేయునది' - అంటారు బూర్గుల రామకృష్ణారావు. 'నేను బెంగాలులో మంచి అనుభవం సంపాదించితిని. గ్రంథాలయములనగా విప్లవ సంఘములు (Revolutionary Bodies) - అంతే - మరేమీలేదు' అని నిష్కర్షగా చెబుతాడు పోలీసు శాఖాధిపతి ఆర్మ్ స్ట్రాంగ్. అంత మాత్రాన గ్రంథాల యోద్యమం గాని ఆంధ్రోద్యమంగాని వెనకబడవు. ప్రథమ ఆంధ్ర మహాసభ సురవరం ప్రతాపరెడ్డి అధ్యక్షతను మెదక్ జిల్లా జోగిపేటలో జరుగుతుంది. రెండవ ఆంధ్రమహాసభ నల్లగొండజిల్లా దేవరకొండలో బూర్గుల రామకృష్ణారావు అధ్యక్షతన 1931 మార్చిలో జరుగుతుంది. దేవరకొండ సభలోని తీర్మానాల కారణంగా, మూడవ సమావేశం జరిపేందుకు నిజాం ప్రభుత్వం అనుమతి నిరాకరిస్తుంది. చివరి కెలాగో మూడవ సభ, 'సనాతన ధర్మ పక్షావలంబుల' సహకారంతో ఖమ్మంలో జరుగుతుంది. షాద్‌నగర్‌లో 1936 నాటి అయిదవ మహాసభనాటికి (అధ్యక్షులు : కొండా వెంకట రంగారెడ్డి) రావి నారాయణరెడ్డి వర్గం ఏర్పడటం, ఆరవదైన భువనగిరి సమావేశం నాటికి ఆంధ్రమహాసభ రెండుగా చీలిపోవడం జరుగుతుంది. 13 వ ఆంధ్ర మహాసభ జమలాపురం కేశవరావు అధ్యక్షతను, మెదక్ జిల్లా కంది గ్రామంలో జరిగింది – ఆ తర్వాత ఈ మహాసభ హైదరాబాదు స్టేట్ కాంగ్రెస్‌లో విలీనమయింది.

ఇండియన్ నేషనల్ కాంగ్రెస్‌తో ఈ హైదరాబాదు స్టేట్ కాంగ్రెస్‌కి ఎటువంటి సంబంధమూ లేదనీ, తాము ప్రభు విధేయులమనీ చెబుతూనే, నిరంకుశ నిషేధాజ్ఞలని ధిక్కరిస్తూ సత్యాగ్రహానికి పూనుకున్నారు స్టేట్ కాంగ్రెస్ నాయకులైన గోవిందరావు నానల్, రామకృష్ణ దూత్, జనార్దనరావు దేశాయి. శ్రీనివాసరావు బోరికర్, బూర్గుల రామకృష్ణారావు, రావి నారాయణరెడ్డి, స్వామి రామానంద తీర్థ మున్నగువారు .... ఒకే మాటగా నాయకుని ఎన్నుకోవడం పోయి, స్టేట్

కాంగ్రెస్ అధ్యక్ష పదవికి బూర్గుల, రామానంద తీర్థ పోటీ చేయడం, బూర్గుల రామకృష్ణారావు మూడు వోట్లు తేడాతో వోడిపోవడమూతో చిన్న చిన్న కలతలు తల ఎత్తినా ముషీరాబాద్ మైదానంలో (హైదరాబాదు) - 1947 జూన్‌లో జరిగిన హైదరాబాదు స్టేట్ కాంగ్రెస్ మహాసభ, నిజాం సంస్థానం యావత్తూ భారత యూనియన్ లో విలీనంగావాలి అనే తీర్మానాన్ని ఏక గ్రీవంగా అమోదించారు. బూర్గులని మితవాదిగా ప్రత్యర్థులు భావించినప్పటికీ, తెలుగు జాతికి ఆయన చేసిన మహోపకారం మరువరానిది.

హైదరాబాదుని భాషా ప్రాంతాలుగా విడగొట్టక, అలాగే వుంచుదామనుకొన్న మౌలానా అజాద్‌తో బూర్గుల అంటారు: 'విశాలాంధ్ర ఏర్పడ్డాక, నేను ముఖ్యమంత్రిగా ఉండను. ఉండగల అవకాశం లేదని - నాకు తెలుసు. విశాలాంధ్ర ఏర్పడాలని నేను పట్టుబట్టడం రాజకీయంగా నా 'డెత్ వారంట్' పై సంతకం పెట్టుకోవడమని నాకు తెలుసు. అయితే నా కుర్చీ, నా పదవీ కాదు ముఖ్యం - విశాలాంధ్ర స్థాపన తెలుగు జాతికీ, తెలుగు సంస్కృతికీ నూతన ఉషోదయ మవుతుంది' - అటువంటి త్యాగధనుల జీవితాలు యువతకు మార్గదర్శకమైనప్పుడే ఈ దేశం బాగుపడుతుంది.

హైదరాబాదు రాష్ట్రానికి ఆయన ముఖ్యమంత్రి. 1956 నవంబరు ఒకటొతేదిన ఆంధ్రప్రదేశ ఏర్పడ దాకా ఆయన ముఖ్యమంత్రే! ఆ తర్వాత కేరళ గవర్నరు, ఉత్తర ప్రదేశ్ గవర్నరు. నాలుగేళ్ల రాజ్యసభ సభ్యత్వం 1966 లో ముగిశాక, లోక్ సభకు నిలబడదామనుకోగా కాంగ్రెస్ అధిష్ఠాన వర్గం ఆయనకు టికెట్ యివ్వలేదుట. 1967 సెప్టెంబరు 14 వ తేదీన ఆయన పరమపదించారు.

సాహితీపరులు, బహు భాషావేత్త, ఫారసీక పండితులు అయిన బూర్గుల కృష్ణారావు 'జనసేవయె నీసేవని - జనతా రాజ్యాధి భారజనిత క్లేశం - బునగ్రుంకుచుంటి నిత్యము - గనికరమున బరువు దింపి కావవె కృష్ణా' అంటారు - ఏకాదశినాడు భగవన్నామస్మరణతో కన్ను మూసిన ఈ తేజోమూర్తి.

ఒక మహాపురుషుని జీవిత చిత్రణ తెలుగు పాఠకుల మదిలో నిలిపారు డి. రామలింగం.

—క్షీరసాగరమ్

తులసి కథలు - చాగంటి తులసి. ప్రచురణ: విశాలాంధ్ర పబ్లిషింగ్ హౌస్, విజ్ఞానభవన్, 4-1-455 బ్యాంక్ స్ట్రీట్, హైదరాబాదు - 500001 .... వెల: రు. 12-00.

"ఈ కథలు రాసిన అమ్మాయిని, పుట్టిన నాటినుండీ నేనెరుగుదును. - చాగంటి సోమయాజులు రెండో కూతురు .... ఏ సాహిత్య ప్రక్రియ తీసుకున్నా, అది వ్యక్తి అనుభవాన్ని విస్తృత పరిచేదిగా ఉండడమే దా

ప్రయోజనం .... ఉత్తమ పురుషాత్మకంగా రాసిన 'వలయం' అన్న కథలోని కళాకౌశలం కొని యాడదగింది. .... ఒరిస్సా రాష్ట్రంలో హిందీభాషతో అధ్యాపకత్వాన్ని నిర్వహిస్తున్న ఈమె కథలన్నీ కథాకథన కౌశలాన్ని ప్రదర్శిస్తున్నాయన డానికి వెనుదీయను" - అన్నారు రోణంకి అప్పలస్వామి 'ప్రవేశిక' లో. పత్రికలే తప్ప కథానికా సంపుటాలు అరుదవుతున్న ఈ రోజులలో 'విశాలాంధ్ర' వారు ఒక మంచి పని చేశారు. ఈ సంపుటిలో మొత్తం పధ్నాలుగు కథలు వున్నాయి. కథలన్నీ చదివిన మీదట రచయిత్రి చెప్పబూనే ప్రపంచం మనకు అవగతమవుతుంది. మధ్యతరగతి ఉద్యోగస్థులు ఉద్యోగినులు, సర్దుకు పోయే సంసారాలు, ఆ దర్శాలు పలకక పోయినా ఆదర్శవంతంగా జీవించేవారు. విద్యాగంధం లేకపోయినా వివేకం సమృద్ధిగా గల పేదలు, అర్ధన్యాయ ప్రభావం గ్రహింపనేరని అమాయకులు - యిటువంటి వారు మన కళ్లముందు ప్రత్యక్షమవుతారు ఈ కథానికలలో. రచయిత్రి వాడిన భాష ఆయా పాత్రలకు మరింత జీవమిచ్చింది .... ఆడపిల్ల సంపాదన నిర్విచారంగా ఖర్చు చేస్తున్న కుటుంబం, ఆ అమ్మాయి భార్య పిల్లలు గల వ్యక్తికి 'చిన్న దేవేరి' అయేందుకు సిద్ధపడే సరికి విస్తుపోతుంది. బాంకు ఏజంటుగారి భార్య సావిత్రమ్మ. తనకి చదువు వుందిగాని పనిమనిషి సత్తికి గల తెగింపు లేదని దిగులు పడుతుంది. సామాజిక స్వరూపానికి అద్దం పట్టేలా వున్న ఈ కథలన్నీ పాఠకుని హృదయ తంత్రులు మీటుతాయి. కథ అల్లడంలో వివరించి చెప్పడంలో సిద్ధహస్తురాలు వాగంటి తులసి.

— సుమతి

# డైరీ

## 1989 డిసెంబరు 08

"సినిమాలలో డైలాగులు చెప్పడం తప్పితే, స్టేజిమీద మాట్లాడమంటే నాకు భయం.... 1961లో రామినీడు గారు 'ఆంధ్రాక్లబ్' లో 'భలేపెళ్లాం' నాటకం ప్రదర్శింపగల అవకాశం కలిగించారు. అదే నా జీవితంలోని మలుపు - మీ అందరిచేత ఊర్వశి అని, కళా సరస్వతి అని మెప్పులు తెప్పించిన మలుపు కాని, ఆనాడు, ఈనాడు నేను శారదనే! ఆ రామి నీడుగారే మళ్లీ యివ్వాళ, యిందరు అభిమానులు, విద్వజ్జనులు ముందు నాకు సన్మానం చేసినప్పుడు నా మనసు ఎటువంటి సంతోషంతో వుక్కిరి బిక్కిరవుతుందో మీరు ఊహించుకోగలరు - ఆ సంతోషాన్ని తెలుపగల మాటలు నాకు రావు.... రామినీడుగారి పిక్చర్స్‌లో నేను యాక్ట్ చేసినది ఒక్కటే .... మొదట్లో నేను కామెడి పాత్రలకు తప్ప పనికిరానన్నారు. మళయాళ చిత్రసీమవారు నన్ను ఆదరించారు; 'తులాభారం' ఒక మలుపు. 'మనుషులు మారాలి' వంటి చిత్రాలయాక, నేను ఏడుపు పాత్రలకి తప్ప పనికిరానన్నారు. 'చండశాసనుడు' లో కథానాయకుడు రామారావుగారిని ఎదిరించి మాట్లాడే పాత్ర. ఆ తర్వాత నాకు లభించిన పాత్రలు స్త్రీవ్యక్తిత్వానికి గుర్తుగా నిల్చినవే. సురేష్ వారి 'ప్రతిధ్వని', 'అనసూయమ్మగారి అల్లుడు' - యిలాటివి. ఎన్ని విభిన్న పాత్రలు ధరించినా, శారద శారదే, మీ శారదే" అని ఎంతో హృద్యంగా సమాధానం చెప్పారు వాణీమహల్లో మహాలక్ష్మి క్లబ్ సాంస్కృతిక విభాగం (అధ్యక్షులు: రామినీడు - సెక్రటరీ: యమ్ సత్యనారాయణ్) తనకు జరిపిన సన్మానానికి, ముమ్మారు ఊర్వశీ గౌరవం పొందిన ప్రఖ్యాత నటీమణి శారద. కామెడీ పాత్రలనుంచి, ఏడుపు పాత్రల నుంచి పోలీసాఫీసరూ పబ్లిక్ ఫిగరూ అయిందామె. సభాధ్యక్షులు: యార్లగడ్డ శంభుప్రసాద్; సన్మాన నిర్వహణ: సూర్య కాంతం .... "సంసార పక్షంగా మంచితనమూ, చల్లనిమనసుతో, తెలుగింటి ఆడ పడుచుకి ప్రతీకగా కనిపించే మా తెనాలి శారద అతిక్లిష్టమైన పాత్రలు అదితీయంగా పోషించింది" - అని

అభినందించారు గుమ్మడి.... "1982 దాకా ఆమె నటిగానే తప్ప వ్యక్తిగా నాకు తెలియదు.... 'చండశాసనుడు' లో సిస్టర్ పాత్ర ఎవరు వేస్తే బావుం టుందని రామారావుగారు, స్క్రిప్ట్ రచయితని కాబట్టి, నన్ను అడిగారు. 'న్యాయం కావాలి' లోని పాత్ర పోషణ చూసి వుండటంచేత, 'శారదగారు వేస్తే బావుంటుంది' అన్నాను. 'మేము జయంతి - అనుకుంటున్నామే !' - అన్నారు అన్నగారు, 'జయంతి కంఠం లో ఆర్ద్రత కనిపిస్తుంది - ఈమె కంఠం లో ధీమా ఉంటుంది. నేను మలిచిన పాత్ర సామ్యవాద ధోరణిలోది' - అన్నాను. 'అటులనా ?' అని ఆ రోజు కావిషయం వొదిలేసి, నెల్లాళ్ల పోయాక మళ్లీ అడిగారు; సిస్టర్ పాత్ర ఎవరు వేస్తే బావుంటుంది ?' అని ! 'శారద' అన్నాను. 'అంతేనంటారా ?' - 'అవు నండీ, శారదగారే ఆ పాత్రకు సరి పోతారు' - అన్నాను. మళ్లీ నెలా నెలా పదిహేను రోజులు పోయాక, 'సిస్టర్ పాత్రకు ఎవరు ?' అని అడిగారు రామారావుగారు.... 'శారదగారండీ' అన్నాను పట్టువిడవని విక్రమార్కు డిలా.... అన్నగారి మాటకు ఎదురు చెప్పడం ఎంతటి సాహసమో మీకు తెలుసు. ఆయన 'జయంతి' అనుకొని వుండవచ్చు ; నేను 'శారద' అంటు న్నాను. శారదగారు నాకప్పటికి తెలి యదు. మళ్లీ పది పదిహేనురోజులు పోయాక 'సిస్టర్ పాత్రకు ఎవ రంటారు?' అని రామారావుగారు అడిగే సరికి, నాకు గాభరాపుట్టింది - ఎందుకు నన్నిలా యిరుకులో పెడుతున్నారా - అని ! మళ్లీ నేను 'శారద' అనబోయే ముందే, ఆయన 'మీరు చెప్పినట్టే శారదగారిని బుక్ చేశాం - జస్టిస్ చౌదరి సెట్‌లో ఆ విషయం చెప్పాం' అనే సరికి 'హమ్మయ్య' అనుకున్నాను. రామారావుగారిలోని గొప్పతనమది. నేనంత పట్టుదలగా ఆ పాత్రకు ఈమె గారే సరిపోతుందని చెప్పడంలోని నమ్మకాన్ని సిన్సియారిటీని గ్రహిం చారు.... 'చండశాసనుడు' ఆమె నట జీవితంలో ఒక ప్రధానమైన మలుపు" - అన్నారు పరుచూరి గోపాలకృష్ణ....

మద్రాసు 'ఐపిటిఎ' వారు 'హాలికులు సేమమా ?' అనే నాటకం ప్రదర్శిం చారు ప్రారంభంలో. సన్మానాంతరం ఎపి డెయిరీ కల్చరల్ అసోసియేషన్ వారి 'తులసితీర్థం' నాటకం. మొద టిది రైతుల కడగండ్లకు సంబంధించి నది. వేలు ముద్దర రైతు, దళారి వల్ల మోసపోయి, తెల్లారి ఇల్లు వేలాం అయేలోపున 'ఎండ్రిన్' తాగి మరణించ డం యిందులోని యితివృత్తం. శ్రీశ్రీ మార్కు గేయాలు. నటనబావుందిగాని నాటకంలో వాస్తవికత తక్కువ. అప్పటికే దగ్గర దగ్గర తొమ్మిదవటం వల్ల 'తులసి తీర్థం'కు ఉండటం పడలేదు.

. . . . . 09

"నాలుగు వేదాల నుంచి వాచకం, శబ్దం, గానం, రసం సేకరించి నాట్య శాస్త్రం రూపొందించాడు భరతముని. ఈనాడు ప్రభా రమేష్ చూపిన అంగికం, సాత్వికం, అభినయం గుండె

లోతులని తాకి, మనని పరవశింప జేసింది. సిద్ధేంద్రయోగి కూచిపూడి నాట్యవిస్తరణ జీవిత ధ్యేయంగా పెట్టుకొన్న వెంపటి చినసత్యం అభినందనీయులు" - అన్నారు ముఖ్య అతిథి జంధ్యాల, కళాసాగర్ వారు రాజా అన్నామలై హాలులో ఏర్పరిచిన డాన్స్ ప్రోగ్రామ్ సందర్భంగా! 'ప్రభూ, స్వప్నంలో సైతం నిన్ను కీర్తించే కర చరణ విన్యాసం నాకనుగ్రహించు, స్వామీ' అని వేడుకొనే ప్రభా రమేష్, వెంపటి చినసత్యం శిష్యురాలు. చక్కటి విగ్రహంతో అభినయ నృత్తాలలో సుశిక్షణ గల ఈ నాట్యకారిణి. పలు చోట్ల ప్రదర్శనలిచ్చి, సెవా సంస్థలకు, కూచిపూడి ఆర్ట్ అకాడమీ భవన నిర్మాణానికీ తోడ్పడుతున్నారు. తెలుగు, తమిళ, మళయాళ, కన్నడ సినిమాలలో నటించి అనేక అవార్డులు పొందిన ప్రభ, కూచిపూడి ద్వారా రసజ్ఞులను మెప్పిస్తున్నారు. ఇవ్వాళ వేసిన నాలుగు అయిటమ్స్‌లోనూ కృష్ణ శబ్దమూ ఆనంద తాండవమూ బాలా ఉన్నతంగా ఉన్నాయి. ఆర్టిస్ట్ తన కళాప్రదర్శనలో తాదాత్మ్యం పొందడం కనిపిస్తుంది. విరహోత్కంఠితంగా యదువంశ సుధాంబుధి శివలీలా పారవశ్యంతో చంద్రుని,

చిదంబర నాధుని కీర్తించడం, ప్రేక్షక హృదయ వీణాతంత్రులని సుతారంగా కదిలిస్తుంది. విజయ రెండు అయిటమ్స్ చేసినది: కొలువై వున్నా రంగసాయి (కృష్ణశాస్త్రి), తిల్లానా! బొంగరంలా గిర గిర తిరుగుతూ, ఆంగికంలో, ముద్రలలో, భావస్ఫూర్తిలో, విన్యాసంలో, వేగంలో ప్రేక్షకులని ఆకట్టుకొన్న విజయ ఎంతో చక్కటి భవిష్యత్తు గల నాట్యకారిణి, ఇటువంటి ప్రదర్శనలు చూస్తున్నప్పుడు బంగారానికి పరిమళం తెప్పించే గురువు కళాప్రపూర్ణ వెంపటి చినసత్యం - అని అనిపించక మానదు. (నట్టువాంగమ్: గు రు వు గా రు; గాత్రం: కనకదుర్గ; వీణ: సంగీత రావు; మృదంగం: గోవిందరాజన్; ఫ్లూట్: నాగరాజన్; వయొలిన్: యమ్మెస్‌రావు; ఘటం: గణేష్) కళాసాగర్ సామాన్య సభ్యులకి కావల్సినవి సినిమాలు ప్రత్యేకాభిరుచిగల వారికి కావలసినవి లలితకళలు. ఇరువురినీ సంతోష పెడుతోంది కళాసాగర్.

. . . . . 11

'తడిసోకుల తాకిడిలో - వళ్లంతా చుట్టుకున్న వన్నెలాడితో' (శాంతిప్రియ), 'నువ్వేసే గాలాలే, నవ్వేసే గాయాల'వుతాయి అంటాడు రమేష్‌బాబు - వెంకట పద్మావారి 'కలియుగ అభిమన్యుడు'లో. (పాటలు: వేటూరి; గాత్రం: బాలు, జానకి; సంగీతం: హంసలేఖ). రవిచంద్ర దర్శకత్వంలో, కాశీ విశ్వనాధరావు నిర్మిస్తున్న ఈ చిత్రంలో నాయికా నాయకులతో బాటు ఇరవైమంది డాన్సర్లు పాల్గొన్న బ్రేక్‌డాన్స్ ఊటీలో చిత్రీకరించారు - అదొక ప్రత్యేక ఆకర్షణ. రమేష్‌బాబు, శాంతిప్రియలు గాక రావుగోపాలరావు, కోట శ్రీనివాసరావు, ప్రసాద్‌బాబు, సుధాకర్, నిర్మల, కుయిలీ మున్నగువారున్నారు ....శర్వాణీ సంగీతసభ వారు ప్రతిసారీ ఇన్విటేషన్ పంపుతున్నారు. కాని, యింతవరకూ ఒక్కతడవకూడా వెళ్లడం పడలేదు - వెళ్లాలనే ఉంటుంది - అందులో మనకి బాగా తెలిసినవారు ఒక మంచిపని చేస్తున్నారంటే తప్పకుండా వెళ్లాలనిపిస్తుంది. (సెంట్రల్ బాంక్ డివియస్ శాస్త్రిగారి అమ్మాయి యస్ వసంత ఈ సభకు సెక్రటరీ). కాని, యిన్నాళ్లూ ఆఖరిక్షణాన ఏదో అడ్డొచ్చేది; ఇవ్వాళ 'గుడ్‌లక్'లో పాటలయాక, తిన్నగా బర్కిట్‌రోడ్ వెళ్లాను. వచ్చినది కొద్దిమందే అయినా, సీరియస్‌గా సిన్సియర్‌గా వినదల్చుకున్నవారు! మాస్టర్ జయశంకర్, మాస్టర్ అంబికాప్రసాద్ వయోలిన్‌మీద రాగసుధలు చిలికించారు. మంచి భవిష్యత్తుగల చిన్నవాళ్లిద్దరూను!

. . . . . 12

మహమ్మద్ ఇక్బాల్ ఉర్దూ క్లాసిక్ 'షిక్వా, జవాబెషిక్వా'ని డా॥ బెజవాడ గోపాలరెడ్డి 'ఫిర్యాదు - జవాబు'గా తెలుగులోకి అనువదించి, యశశ్శరీరుడైన సాహితీబంధువు దాశరధికి అంకితమిచ్చారు; ఆ కవితా సంకలనాన్ని సవేరా హొటల్ మేనేజింగ్

డైరక్టర్ ఎ. వెంకట కృష్ణారెడ్డి ఆవిష్కరించారు. స్విమ్మింగ్‌పూల్ పక్కన ఏర్పరిచిన ఈ సాహితీమిత్ర సమావేశం ఎంతో సరదాగా గడిచింది. పరస్పర పలకరింపులూ కబుర్లేతప్ప ఉపన్యాసాలు, కవితా దీప్తుల వివరణ యిలాటి వేమీ లేవు. ఇంటికి వెళ్లాక ఎవరికి వారు చదువుకు ఆనందించవచ్చు - కొన్ని కాపీలు పంచిపెట్టారు గనక. రెండు ప్రఖ్యాత తెలుగు దినపత్రికలు ఆవిష్కరణోత్సవాన్ని ఫొటోలు తీసుకున్నాయి. దాశరథి సవేరా వారికి ఎంతో సన్నిహితుడు - సవేరా సోదరులు ముగ్గురికీ ఆయనంటే ఎంతో అభిమానం. అంచేత, దాశరథి స్మృతికి అంకితమిచ్చిన ఈ పుస్తకాన్ని ఎవికె రెడ్డి రిలీజ్ చేశారు. ఇవ్వాళ యిక్కడికొచ్చిన పాతిక ముప్ఫయిమందీ ఈ సాహితీ సుమపరిమళాన్ని, ఈ సాయం సంధ్యారోచిస్సునీ, ఇందరిని ఈ విధంగా సమావేశపరిచిన ఎవికె రెడ్డి గారి మంచి మనసునీ మర్చిపోలేరు.

. . . . . 14

రేపు పదిహేను ఉదయం 3 గం॥ 53 ని॥లకు తులా లగ్నంలో లక్ష్మి ఒఆర్‌కె రావు (సెక్రటరీ : ఎగ్మూరు బెనిఫిట్ సొసైటీ) దంపతుల కుమార్తె సౌ॥ వెంకట అరుణకు, మద్రాసు ఆంత్రొపాలజీ ప్రొఫెసర్ పి డి ప్రసాద రావు దంపతుల రెండవ కుమారుడు చి॥ రవికి, హేమమాలిని కళ్యాణ మండపంలో వివాహం. ముహూర్త సమయం మరీ దగ్గిరవారు తప్ప, అతిథులు వచ్చేందుకు అనువైన టైము కాదు కాబట్టి, పధ్నాలుగు రాత్రే డిన్నరూ, కొత్తజంట పరిచయమూను! ప్రముఖ ప్లేబాక్ సింగర్ ఆనంద్, తన గాయనీ గాయకులతో శ్రోతలను ఆనందపరిచారు. నూతన వధూవరులకు మా శుభాభినందనలు.

. . . . . 15

"అంకెలలో మాటల కందని అందమూ ఆకర్షణా ఉన్నాయి. కళ్లకు గంతలు కట్టించుకు రాయ్ ఛౌధురి చేసిన అంకెల మాజిక్ అందరినీ అలరించింది. సంఖ్యా శాస్త్రంలో ఒక మిస్టరీ ఉంది. ఈ మద్రాసుకి చెందిన మాథమెటీషియన్ రామానుజమ్ ప్రవేశబెట్టిన 'నెంబర్ థియరీ' పాశ్చాత్యలోకాన్ని విస్మయంలో ముంచింది.... పదివేల సంవత్సరాల మానవ విజ్ఞానచరిత్ర, గత అరవై డబ్భైయ్యేళ్లలో సంపాదించిన దానికి సమానం. మానవ మేధస్సుకి అందనివి సైతం మన కళ్లముందు వుంచుతోంది కంప్యూటర్. రానున్న దశకంలో విజ్ఞానం మరింత ముందంజ వేయనున్నది. నిఘంటువు నిండా పదాలు వుంటాయి; ఎన్‌సైక్లొపిడియా నిండా విజ్ఞాన సర్వస్వం ఉంటుంది. ఈ 'నాలెడ్జి' (Knowledge) మనకి ఎంత ఉపయోగపడుతోంది? దానిని జీవితంలో ఎంతమేర అన్వయించుకో గలుగుతున్నాం? - అదీ ముఖ్యం. పాండిత్యం వున్నంత మాత్రాన, విజ్ఞానం వున్నంత మాత్రాన ప్రయోజనంలేదు. మనం తీసుకొనే ఆహారం బలం పట్టి, శక్తి నివ్వాలి. ఆ శక్తే మన ఆరోగ్యానికీ,

సంతోషానికి హేతువవుతోంది. పాండిత్యం చాలదు, విజ్ఞానం చాలదు - ఈ రెండూ కలిసి మనకు వివేకాన్నీ, విజ్‌డమ్‌నీ (Wisdom) యివ్వాలి. ఆ 'విజ్‌డమ్' లోపిస్తూ వుండటంవల్లనే అంతర్జాతీయంగా,దేశీయంగా,కుటుంబపరంగా మనోవ్యాకులతకు లోనవుతున్నాం - అశాంతితో కొట్టుమిట్టాడుతున్నాం" అన్నారు మాజీ కేంద్రమంత్రి సి సుబ్రమణ్యం, 'విజ్‌డమ్' అంతర్జాతీయ ఆంగ్ల మాసపత్రిక అవార్డ్స్ ఫంక్షన్‌కి అధ్యక్షత వహిస్తూ, రాణీ సీతయ్ హాలులో ! .... "వెనకటి రోజులలో మత ప్రబోధకులు సామాజిక రంగంలోని బూజు దులిపి, ప్రజలను చైతన్య వంతులు గావించే వారు - ఇప్పుడా అవకాశం కనిపించడం లేదు. స్వామీ చిన్మయానంద చెప్పినట్లు, ఒక ప్రపంచం మృతి చెందింది; మరొక ప్రపంచం పురిటి నొప్పులు పడుతోంది. మనం దేనికి చెందవలసినదీ ఎవరికి వారు నిర్ణయించుకోవాలి.... తను నానాకష్టాలూపడి డ్రేఫస్ కేసుని పైకి లాగి, పునఃపరిశీలన చేయించి, నిప్పులాంటి నిజాన్ని ఎవరూ దాచలేరు - అని ఫ్రెంచి ప్రజానీకానికీ యావత్ ప్రపంచానికీ చాటిన ఎమిలీజోలా, నేటి రచయితలకు, పత్రికా రచయితలకు, మార్గదర్శకుడవాలి. చేతిలోని కలం సాంఘిక చైతన్యానికి తోడ్పడినప్పుడే దాని సార్థకత" - అన్నారు మద్రాసు

హైకోర్టు జడ్జి శివ సుబ్రమణ్యం, 'విజ్‌డమ్' (ఇంగ్లీషు) 17వ వార్షిక సంచికను విడుదలచేస్తూ! తనకు ముందు ప్రసంగించిన యిరువురు ప్రముఖ న్యాయవాదుల కోయంబత్తూరు నుంచే తనూ వచ్చాననీ, నేర్పు, ప్రతిభ, సాహసం యిలాటివి వుండగానే సరిగా దనీ, వాటిని సమన్వయింప జేసే విజ్‌డమే వ్యక్తిని వివేకవంతునిగా చేయగలుగుతుందనీ అన్నారు విజడమ్ (తెలుగు) 8వ వార్షిక సంచిక విడుదల చేస్తూ, మద్రాసు హైకోర్టు జడ్జి రామ లింగం. జస్టిస్ రామానుజమ్ అవార్డు గ్రహీతలను అభినందించారు. 'విజ్‌డమ్' సంపాదకులు కెవి గోవింద రావు, ఆహూతులకు స్వాగతం చెబుతూ, ఈ పత్రికా విజయం వెనుక తన కుటుంబ సభ్యులందరి సమిష్టి కృషీ వుందనీ, 'స్టాఫ్' తనకెప్పుడూ సంపూర్ణ సహకారమిస్తున్నారనీ తాంబ రంలోని 'హిందూ మిషన్' హాస్పిటల్‌కి 'రత్నా అండ్ రావు విజ్‌డమ్ ట్రస్ట్' పదివేలరూపాయిల విరాళం ఈ వార్షి కోత్సవ సందర్భంగా యిస్తున్నదనీ తెలిపారు. 1989 'విజ్‌డమ్' అవార్డు గ్రహీతలు :

1 ఉత్తమ డాక్టరు - ఆర్ గణే శన్ ; 2 పబ్లిక్ రిలేషన్స్ - బాలా విశ్వనాథన్ ; 3 సోషల్ వర్కర్ - టి లక్ష్మయ్యగుప్త ; 4 ఉత్తమ రంగ స్థల నటుడు - రాధారవి ; 5 నాటక రచయిత - లియొ ప్రభు ; 6 హాస్య నటుడు - యస్వెస్ చంద్రన్ ; 7 రంగ స్థలనటి - కాంతిమతి ; 8 ఉత్తమ నర్సు-పర్చెల్వి ; 9 విద్యార్థినీ, విద్యార్థి నులు - శుభ ; 10 కమల ; 11 బాలకృష్ణన్ ; 12 శిల్పా ; 13 గౌరి ; 14 రాధిక ; 15 ప్రకాష్ ; 16 రష్మి ; 17 జె. హేమలత ; 18 గుణశేఖర్ ; 19 పద్మనాభ ; 20 జి హేమలత ; 21 జి. ధనలక్ష్మి ; 22 పెరైరా ; 23 సురియా ; 24 రాజేశ్వరి ; 25 షాఫియా ; 26 లక్ష్మి అపర్ణ ; 27 బాలసుబ్రమణ్యం ; 28 ఫాతిమా ; 29 మహేష్ ; 30 సుధా ; 31 లూసీ ; 32 మంగళ ; 33 పరి మళ ; 34 బెస్ట్ పోస్ట్‌మాన్ - కొలతు ; 35 ఎయిర్ కాడెట్ - చంద్రశేఖర్ ; 36 నావల్ కాడెట్ - రామకృష్ణన్ ; 37 ఆర్మీకాడె జూనియర్ - ఆత్రేయ ; 38 ఆర్మీకాడెట్ సీనియర్ - సుదర్శ న్ ; 39 గర్ల్‌కాడెట్ సీనియర్ - నీరు ; 40 గర్ల్‌కాడెట్ జూనియర్ - వందన ; 41 బెస్ట్ డ్రయివర్ - నారాయణన్ ; 42 కండక్టర్ - బాల సుబ్రమణియన్ ; 43 బధిరులలో బ్రిలి యంట్ బాయ్ - చంద్రశేఖర్ ; 44 గర్ల్ - ముర్షీదా ; 45 స్కవుట్ - ప్రథమ్ ; 46 గైడ్ - ఎజిలారసి ; 47 ఎసి డ్రయివర్ - శివశంకరన్ ; 48 అంబులెన్స్ - పుష్పరాజ్ ; 49 రక్షక్ - సహదేవన్ .... ఈ అవార్డు గ్రహీతలతో బాటు సిబ్బందీ మున్నగు వారికి కూడా బహుమతులంద జేశారు. సెన్సేషనులు లేకుండా సినీమాల జోలికి పోకుండా, అడ్వర్టయిజ్ మెంటుల మీద ఆధారపడకుండా యింత చక్కగా, ఘనంగా పత్రికా

నిర్వహణ గావిస్తున్న కెవి గోవింద రావు అభినందనీయులు. ఆరోగ్య వంతమగు రచనలను లక్షోప లక్షల పాఠకులు మనస్పూర్తిగా ఆదరిస్తార నేందుకు 'విజడమ్' విజయం ఒక ప్రత్యక్ష నిదర్శనం (9 దేశికా రోడ్, మద్రాసు - 4)

. . . . . 16

"ప్రగతికి దోహదకారి అయే టెక్నాలజీ పెరుగుదలని ఎవరూ ఆపలేరు. విడియో థియేటరూ, విడియో టెక్నాలజీ అదే కోవలోకి వస్తాయి. సాధారణ ఫిలిమ్ ప్రింటు ఒక్కంటికి నలభై వేలవుతుంది ; అదే, విడియో ఫిలిమ్ అయితే వెయ్యిరూపాయిలు చాలు. చిన్న తెరను, బ్రిలియన్సీతో పెద్దదిగా వెయగల సాధనాలు కూడా జపాన్‌లో తయారవుతున్నాయి.... విడియో, సాధారణ సినిమాకు విరోధి అనీ, విడియోవిస్తరణ వల్ల ఫిలిమ్ పరిశ్రమ దెబ్బ తింటుందనీ ఒక దురభిప్రాయం ఉంది - ముఖ్యంగా ఫిలిమ్ సర్కిల్స్‌లో! అది సబబూ కాదు, సమర్దనీయమూ కాదు. ఆరోగ్య వంతమగు వినోదం యివ్వడం ద్వారానే మన గ్రామీణ ప్రజలను వారి జడత్వం నుంచి లేవనెత్త గలుగుతాము. 'విడియో పార్లర్స్' అనబడే ఈ విడియో థియేటర్లు, రెండు మూడు వందలమందికే పరిమితమై ఉంటాయి. పెద్ద థియేటర్లు వెయ్యా పన్నెండువందల మందికి. ఈ రోజున



హిందీ సినిమాల విడియో హక్కులు 50 లక్షలు, 75 లక్షలకు అమ్ము తున్నారు.... విడియో విస్తరణకు కేంద్ర ప్రభుత్వం లోగడ ఒక సలహా సంఘాన్ని ఏర్పాటు చేసింది - అందులో నేను కూడా మెంబర్నే ! విడియో వ్యాప్తిని క్రమానుగతమూ చట్టబద్ధమూ చేయడం ద్వారా, ప్రజ లకు, వినోద వ్యాపారానికీ మేలు చేసిన వారమవుతాము" - అన్నారు ఏక్‌నాథ్, రోహిణీ ఇంటర్నేషనల్ టూప్ ఫ్లోర్‌లో జరిపిన పత్రికా సమా వేశంలో ! హైదరాబాదులో డిసెంబరు 21 నుంచి 25 దాకా 'విడియో - ఎక్స్‌పో' (విడియో పరికరాల ఉత్పత్తి దారుల భారీ ప్రదర్శన - 50 స్టాల్స్ - అమ్మేవారి, కొనేవారి, పరస్పర సంప్రదింపులు - ప్రయివేటు రంగం లోని ఈ పరిశ్రమకు సంబంధించిన ఆర్థికవనరులు, కష్టసుఖాలు యిత్యా దుల పరిశీలన) నిర్వహింపనున్న సందర్భంగా ఏర్పాటైన గోష్ఠి. ఉత్తర భారతంలో 40,000 విడియో థియేటర్లు వుండగా, దక్షిణ భారతంలో విడియో అభివృద్ధి ఎందు వల్ల కుంటుపడుతోంది ? ఫిలిమ్ పెద్దల వ్యతిరేక భావమా ? ఫిలిమ్ పెద్దలకు అనుకూలంగా వుండే రాష్ట్ర ప్రభుత్వం విధానాలా ? ప్రజలెలా పోతేనేం, మనం బావుంటే చాలునను కొనే సంకుచితత్వమా ? ఏది కానీ యండి, నాలుగైదేళ్లలో విడియో విస్త రణ ఖాయం. 'బస్సుపుట్టి బళ్లవాళ్ల కడుపుకొట్టింది' అని పాట కట్టవచ్చు - తద్వారా సానుభూతి తెలుపవచ్చు : బస్సుపుట్టి గుర్రబ్బండిని, విక్టోరియాని (గుర్రపుషార్టు) వెనక్కి నెట్టిన మాట నిజమే ! కాని, అనాదిగా వుండే ఎడ్ల బళ్లను - రెండేడ్ల బళ్లను - అదేం చేయ గలిగింది? ఇప్పటికీ వ్యవసాయ రంగం 80 శాతం రెండెడ్ల బళ్ల మీద ఆధారపడి వున్నదే కదా ! ఆ మారుమూల బండివానికి సైతం ఆరోగ్యవంతమగు వినోదం అంద జేయాలంటున్నారు విడియో వైతాళి కుడు ఏకనాథ్.

..... 17

'చెన్నపురి తెలుగు ప్రజా సంస్థల సమిష్టి'గా అనువదించారు, 'ఫెడరేషన్ ఆఫ్ మద్రాసు తెలుగు పీపుల్స్ అసోసియేషన్స్'ని (Federation of Madras Telugu People's Associ-ations) ఈసంస్థ కార్యకర్తలు 'ఫెడ రేషన్' అనే ఆంగ్లపదానికి ఈనాడు వాడుతున్న తెలుగుమాట 'సమాఖ్య' - నాకు ఒకవైపున ఆంధ్రప్రదేశ్ ఛీఫ్ కన్సర్వేటర్ ఆఫ్ ఫారెస్ట్స్, మరొక వైపున ఆలిండియా రేడియోస్టేషన్ డైరక్టరు కూచునివున్నారు. 'సమిష్టి' అనడం కరెక్టు కాదని ముగ్గురం అను కున్నాం.... 'సమయం దగ్గిరకొస్తోంది అందరూలోనికి రండి' అని మైకులో ఎవరో అనౌన్స్ చేసినప్పుడు, సమయం దగ్గిరికి రావడమేమిటని ముగ్గురం ముఖాలు చూసుకున్నాము అపద్రప్రయో గానికి .... సైడ్‌లైట్స్ వొదిలేసి అసలు విషయానికి వద్దాం.... ఈ

నూతన సంస్థకు అధ్యక్షులు ప్రొఫెసర్ సి యమ్ కె రెడ్డి (డాక్టర్ ముత్తు కృష్ణా రెడ్డి); ప్రధాన కార్యదర్శి: టివి గోపాలరావు.... 'మదరాసు నగర 350వ వార్షికోత్సవమునకును, నవభారత రూపశిల్పి భారత ప్రథమ ప్రధాని, పండిత జవహర్‌లాల్ నెహ్రూగారి శతజయంత్యుత్సవమునకును మీరు మీ స్నేహిత హితబంధువర్గముతో వచ్చి పాల్గొనవలసినదిగా ఆహ్వానించుచున్నాము' - అన్నారు ఆహ్వాన పత్రంలో... నేను ఏడున్నరదాకా వున్నాను. అంతదాకా మద్రాసు పట్నం గురించిగాని, పండిట్ నెహ్రూ గురించిగాని ఒక్క ముక్క ఎవరినోటా రాలేదు. తమిళనాడు ప్రభుత్వం తెలుగు పాఠ్యపుస్తకాలు యివ్వాలనీ, ఏవేవో ఉద్యోగాలు యివ్వాలనీ, సెంట్రల్ స్టేషనులో తెలుగు బోర్డులు వుండాలనీ, తెలుగు భాషకు ప్రాముఖ్యం కలగాలనీ యిలా టివి కోరారు - బాగానేవుంది. కాని, యిటువంటి సభలలోని విన్నపాలకు విలువ ఎంత? వేదికమీద ఆశీనులైన వారిలో చెంగారెడ్డి ఆంధ్రప్రదేశ్ పంచాయితీరాజ్ మంత్రి; వీరాస్వామి ఒక్కరే తమిళనాడు మంత్రి. అసెంబ్లీ ఉపాధ్యక్షులు దురైస్వామిగాని, విద్యుచ్ఛక్తిశాఖామాత్యులు కెయన్ నెహ్రూగాని వచ్చినట్లులేదు; అలాగే ముఖ్య అతిథి కర్నాటక గవర్నరు పెండేకంటి వెంకటసుబ్బయ్య రాలేకపోయారు....

"1910లో గురజాడ అప్పారావు 'దేశమనియెడి దొడ్డ వృక్షం - ప్రేమలను పూలెత్త వలెనోయ్ - అన్నారు. ఆ వృక్షానికి గల శాఖలూ కొమ్మలూ

ఎంటివి ఈ భాషలూ ప్రాంతాలూను. కొమ్మలు పచ్చగా వుంటేనే చెట్టు కలకల్లాడుతుంది. ఆ మీదటనే పువ్వులూ పిందెలు ఫలాలూను. ఈ ప్రత్యక్ష సత్యం మర్చిపోరానిది.... మనుషులలో అల్పత్వం ఉండవచ్చు గాని భాషలన్నీ లతలవలె పాకే లక్షణం గలవి. నన్నయచేత ఆంధ్ర మహాభారతం వ్రాయించిన రాజరాజ నరేంద్రుని భార్య తమిళరాకుమారి. కులోత్తుంగ చోళుడు దక్షిణాన తెలుగు వ్యాపింపజేశాడు. విజయ నగర సామ్రాజ్యాధిపతి శ్రీకృష్ణ దేవ రాయనిది ఏ భాష ? 'తుళు' - కన్నడకు సన్నిహితమైన భాష. అయితే, అష్టదిగ్గజాలు, ప్రసిద్ధ తెలుగు ప్రబంధాలు, ఆ చక్రవర్తి స్వయంగా రచించిన ఆముక్తమాల్యద - వాటి మాటేమేటి ? ప్రతిభాషా సుసంపన్నం కావల్సిందే !" - అన్నారు సభకు అధ్యక్షత వహించిన నారాయణరెడ్డి. "పాత చరిత్ర తవ్వుకు ప్రయోజనం లేదు. వర్తమానంతో బతకడం నేర్చు కోవాలి ... 1937లో నేను మంత్రి నయాక, కోయంబత్తూరు వెళ్లాను. అక్కడ తెలుగు వారెందరో ఉన్నారు ; అయితే వారికి తెలుగు వ్రాయడం, చదవటం రాదు. - మాట్లాడుతారు. ఆ మాట్లాడేది మనకి కొత్తగా ఉంటుంది.... 'ఇందరు ధన వంతులు యిక్కడవున్నారు కదా - మీరు మీ మాతృభాషని వృద్ధి చేసుకొనేందుకు పాఠశాలలూ అవీ పెట్టుకోవచ్చుకదా - ఎందుకా పని చేయరు ?' - అని అడిగాను 1937 లో, 52 ఏళ్లక్రితం. 'తమిళ ప్రాంతంలోవున్న మేము తమిళం నేర్చుకోవాలిగాని - తెలుగు ఎందు కండీ ?' - అని ప్రశ్నించారు నన్ను. అవును, వారు చెప్పిన దానిలో యదార్ధం లేకపోలేదు. నిత్యకృత్యంలో దైనందిన జీవితంలో వారికి కావల్సి నది తమిళంగాని తెలుగు కాదు. ఢిల్లీ లో వుండి హిందీ నేర్చుకోనని అంటే నష్టపోయే దెవరు ? నాలుగు ప్రధాన జాతీయ నగరాలలో ఒకటైన మద్రాసు, భౌగోళికంగా తమిళనాడులో ఉంది. తెలుగు వారితోబాటు కన్నడులు, మళయాళీలు, గుజరాతీలు, పంజాబీలు అల్ప సంఖ్యాక వర్గంలో ఉన్న విషయం మనం ఒప్పుకోవాలి. విద్యావిషయంలో, ఉద్యోగావకాశాల విషయంలో గల కష్ట నిష్టూరాలని ప్రభుత్వం దృష్టికి తెచ్చి, పరిష్కార మార్గాలో అన్వేషించవచ్చు. అంతేగాని వాటిని భాషావాదంతో ముడివేయటం వల్ల ఎటువంటి ప్రయోజనమూ ఉండదు" - అని నిష్కర్షంగా నిర్మొగమాటంగా చెప్పారు, ఈనాటి సన్మానితులని గౌరవింపనున్న డా॥ బెజ వాడ గోపాలరెడ్డి. నేటి సన్మానితులు : టి ఆర్ శ్రీనివాసులు నాయుడు (107 సం॥లు – రిటైర్డ్ పోలీసు వుద్యోగి) ; ముక్కాల నమ్మాళ్వారు శ్రేష్టి (90 సం॥లు - కలవల కణ్ణన్ శ్రేష్టి అల్లుడు - ధర్మసంస్థల నిర్వా హకులు) ; మోటూరి సత్యనారాయణ (87 సం॥ - దక్షిణ భారత హిందీ

ప్రచార సభ సంస్థాపకులు); యస్ కృష్ణస్వామి రెడ్డి (రిటైర్డ్ మద్రాసు హైకోర్టు జడ్జి); పిట్టి కుమారస్వామి శెట్టి (త్యాగరాయశెట్టి ఎడ్యుకేషనల్ ట్రస్ట్ నిర్వాహకులు); బ్రిగేడియర్ రామ్మూర్తి ప్రపంచ ప్రఖ్యాత న్యూరో సర్జన్); వేదం వెంకట్రాయశాస్త్రి (తాత గారికి దగ్గమనుమడు); ఇంటూరి వెంకటేశ్వరరావు (ఫిలిమ్ హిస్టోరియన్) .. (జెవి సోమయాజులు, యల్వి ప్రసాద్, ఎంబెరుమన్నారు శెట్టి సన్మానితుల లిస్టులో ఉన్నారుగాని వారు రాలేదు). మాతృభాషాభివృద్ధి, జాతీయసమైక్యత తమ ధ్యేయంగా పేర్కొంటున్నారు ఈ సంస్థవారు. జాతీయసమైక్యతకు దోహదకారి అయే ప్రతి ప్రయత్నమూ అభిలషణీయమే!

. . . . . 18

"డెబ్బయి ఎనభైఏళ్ల క్రితం, ఆనాటి బ్రిటిష్ పాలకులవద్ద నుంచి ఎటువంటి ఆదరణ లభించని కారణంగా మన సంగీత నాట్యాదులు స్వదేశ సంస్థానాలలో తలదాచుకున్నాయి. సంగీత కళని ప్రోత్సహించాలనే ఉద్దేశ్యంతో 1928 లో మద్రాసు మ్యూజిక్ అకాడమీ అవతరించింది. ఆ తర్వాత నాలుగేళ్లకు 1932 లో, సంగీతంతోబాటు నాట్యాన్ని నాటక కళనుకూడా ప్రోత్సహించాలనే సంకల్పంతో ఇండియన్ ఫైన్ ఆర్ట్స్ సొసైటీ (Indian Fine Arts Society) జనించింది. ముత్తా వెంకట సుబ్బారావు ప్రారంభకులు. విద్వాన్ చౌడప్ప ఈ సంస్థను ఆశీర్వ

దింవారు. ఆ తర్వాత, తమిళ ఇసై సంఘాన్ని రాజా అన్నామలై చెట్టియార్ స్థాపించారు. సంగీత విద్వాంసులతోబాటు రసజ్ఞుల సంఖ్య పెరిగింది; సమీక్షకులు రసోల్లాసాన్ని వివరింపనారంభించారు. ఇండియన్ ఫైన్ ఆర్ట్స్ సొసైటీ గోపాలకృష్ణన్, సహస్రనామమ్ వంటి నటులను వెలుగులోకి తెచ్చింది. సంప్రదాయబద్ధమగు సంగీతానికి యితోధిక సేవచేస్తున్న ఈ సంస్థ తన 57వ వార్షికోత్సవ సందర్భంగా ప్రఖ్యాత విద్వాంసులు కెవి నారాయణ స్వామిని 'సంగీత కళా శేఖర' బిరుదుతో సత్కరిస్తోంది" - అన్నారు - ఆవిష్కరణోత్సవం గావించిన ప్రముఖ పారిశ్రామికవేత్త 'నిప్పొ - డయోనారా'ల ఓబుల్ రెడ్డి, బాలమందిర్ జర్మను హాలులో! సొసైటీ అధ్యక్షులు ఎంబెరుమన్నార్ చెట్టి ఆహూతులకు స్వాగతం తెలిపారు. ఈ బిరుదు ప్రదానాన్ని శెమ్మంగుడి లాంఛన ప్రాయంగా సూచించగా, కృష్ణయ్యర్, సమర్థించారు - అనగా, 'సెకండ్' చేశారు. ఇరువురు మహావిద్వాంసుల సమక్షాన, వారి ఆమోదమూ అంగీకారంతో ఈ గౌరవ సత్కారం జరిగిందని ఆ లాంఛనంలోని అంతరార్థం. మద్రాసు మ్యూజిక్ కాలేజీ ప్రిన్సిపాల్‌గా పనిచేసిన కెవి నారాయణస్వామి (అరైకుడి రామానుజయ్యంగారి శిష్యుడు) సముచిత రీతిని సమాధానం చెప్పినమీదట, అనంత స్వామి, యస్వి కృష్ణన్ ఈ మహా విద్వాంసుని సభారంజకత్వం ఎటువంటిదో మెచ్చుకున్నారు. రామచంద్రన్ తుదిపలుకులతో సమావేశం ముగిశాక, విద్యా నటరాజన్ భరతనాట్యం. డిసెంబరు 18 నుంచి జనవరి 3 దాకా ప్రతిరోజూ ఉదయంపూట భక్తిసంగీతం, పదిగంటలకు లెక్చర్ - డిమాన్‌స్ట్రేషన్, మధ్యాహ్నం ఒంటిగంటనుంచి రాత్రి తొమ్మిదిన్నరదాకా సంగీత నాట్యాలకు సంబంధించిన వివిధానేక కార్యక్రమాలు. మీకు టైమూ అభిరుచీ ఉండాలేతప్ప డిసెంబరు మూడోవారంనుంచి జనవరి మొదటివారందాకా మద్రాసు నగరం యావత్తూ సంగీత సుమదళ శోభితమే!

. . . . . 20

'కెన్నమెరా' వాలాజా రూమ్‌లో మద్రాసు మేనేజిమెంటు అసోసియేషనూ, అమెరికా సమాచారశాఖ (The Madras Management Association and the United States Information Service Madras) సంయుక్తంగా ఏర్పరిచిన 'లెక్చర్ - డిస్కషన్'లో ఆర్థిక నిపుణుడు థామస్ టింబర్గ్ (Dr. Thomas Timberg) 'స్మాల్ క్రెడిట్ అండ్ బిగ్ డెవలెప్‌మెంటు' (Small Credit and Big Development) అనే అంశంపై ప్రసంగించారు. దక్షిణ ఆసియాలో, తూర్పు ఆఫ్రికాలో గల వివిధ దేశాలలోని చిన్నతరహా పరిశ్రమలకు అమెరికానుంచి, ప్రపంచ బాంకునుంచి ఆర్థిక సహాయ మందచేయడంలో కీలక పాత్రగల సలహాదారు టింబర్గ్. అధిక సంఖ్యాకులకు పనికల్పించే చిన్నతరహా పరిశ్రమ

లు ఆర్థిక పరిపుష్టికి దోహదకారి అవుతాయనే సిద్ధాంత న్యాయం నమ్మిన వ్యక్తి. హిందీ, వుర్దు, బెంగాలీ, రష్యన్, ఫ్రెంచి భాషలు ఆయనకు తెలుసు. వ్రాసిన గ్రంథాలలో కొన్ని : ది మార్వారీస్ : ఫ్రమ్ ట్రేడ్ టు ఇండస్ట్రీ (The Marwaris: From Trade to Industry - 1978) స్మాల్ ఎంటర్‌ప్రయిజ్ ప్రమోషన్ (Small Enterprise Promotion) 'ఇన్‌ఫార్మల్ క్రెడిట్ మార్కెట్స్ ఇన్ ఇండియా' (Informal Credit Markets in India).... "చాలా దేశాల లో చిన్నతరహా ఉత్పత్తిదారులు, తమ శ్రమకు తగినంత ఫలితం కనిపించక పోయినా, చట్టబద్ధమగు నియమావళికి లోబడేందుకు అంగీకరించకపోవడం వల్ల, వారికి బాంకుల ద్వారా తగినంత ఋణసౌకర్యం లభించడంలేదు. అంతే కాదు, ప్రభుత్వోద్యోగులు వారిని పీడిస్తారు - అందుకని తప్పుకు తిరగడం క్షేమం - అనుకుంటారు. వారి కష్టసుఖాలు సానుభూతితో అర్థం చేసుకు సహకరించడం ద్వారా సామూహిక ఉత్పత్తిని ఎంతగానో పెంచవచ్చు" - అన్నారు టింబర్గ్. పేదల ఋణాలు రద్దుచేయడం మంచిదా ? అనే ప్రశ్నకు "రాజకీయ నాయకులు తమ ప్రాబల్యం పెంచు కొనేందుకు అటువంటి పనులు చేస్తారు. ద్రవ్యసంపదలో అది చాలా చిన్నమొత్తం అయినప్పటికీ, సామాజి కంగా మంచిదికాదు. పుచ్చుకున్న ఋణం, వాపసు చేయాలనే భీతి లేనప్పుడు, నూటికి తొంభయి తొమ్మండుగురు ఎగ్గొడతారు - అది మానవ స్వభావం' - అన్నారు థామస్ టింబర్గ్.

. . . . . 21

ప్రఖ్యాత ప్లేబాక్ సింగర్ బాల సుబ్రహ్మణ్యం సోదరి - ప్రసిద్ధగాయని సౌ॥ శైలజకు, మొదటి చిత్రంతోనే ఆంధ్రా అంతటా గుర్తింపు పొందిన శుభలేఖ సుధాకర్‌కీ ఈ ఉదయం పదకొండున్నరకి, రజనీకాంత్ కొత్తగా కట్టించిన కళ్యాణమండపంలో వివాహ మహోత్సవం జరిగింది. ముగ్గురూ సినీ ప్రపంచానికి చిరపరిచితులవడం వల్ల ఫిలిమ్‌ఫీల్డ్ యావత్తూ అక్కడే ఉంది. తమని దీవించడానికి వచ్చిన వారికి పంచదార చిలుకలతో నమ స్కృతులందజేశారు నవదంపతులు.... శ్రీకృష్ణ గానసభ వారు, పద్మభూషణ్ కమలను, 'నృత్య చూడామణి' బిరుదు తో సత్కరించిన సందర్భంగా, కూచి పూడి ఆర్ట్ అకాడమీ విద్యాలయంలో అభినందన సమావేశం.... "ఆమె నాట్య సరస్వతి - నాట్యానికే ఆమె పుట్టింది. 1947 నుంచీ నేను ఆమె యడ్మయిరర్ని" అన్నారు వెంపటి చినసత్యం కమలకు స్వాగతం చెబుతూ! .... "ఒక కళాతపస్వి మరొక కళా తపస్విని మెచ్చుకోవడం, గౌరవించడం చాలా అరుదు. ఒకే రంగానికి చెందిన ఈ ప్రఖ్యాత వ్యక్తులు, పరస్పరం చూపించే ఆ గౌరవాభిమానం, సృజ నాత్మక శక్తికి ఎల్లలులేవనే విషయం విశదపరుస్తోంది నాట్యకళా విశిష్టతకు

మరొక పేరు కమల, ముప్ఫయ్యేళ్లుగా ఆమె నాకు తెలుసు. ఆమె ప్రదర్శన లోని స్వచ్ఛందత, సౌకుమార్యమూ విద్యాపాటవమూ వినయసౌశీల్యమూ ప్రతిసారి నన్ను విస్మయపరుస్తూనే ఉంటాయి" - అన్నారు కళావిమర్శ కులు ఎయస్ రామన్. కమల సము చిత రీతిని సమాధానం చెప్పిన మీదట, చివి యస్సెస్ మణి వందన సమర్పణ గావించారు.... 'బాలమురళి' శిష్యురాలైన మురళీకృష్ణ (హైదరాబాదు టెలి కమ్యూనికేషన్ శాఖలో డైరక్టరు) గాత్ర కచ్చేరి ఆహూతులను గానరస మాధురితో అలరింపజేసింది.

. . . . . 22

అనేక కథానికలు నవలలు, నాట కాలు ద్వారా తెలుగు సారస్వతానికీ, జ్యోతి, అభిసారిక వంటివి విజయవంతం గా నిర్వహించి తెలుగు పత్రికా రంగా నికీ యితోధిక సేవ చేసి, 'చంద మామ'తో కొన్నాళ్లపాటు ప్రయాణం చేసి, తెలుగు ప్రింటింగ్ ఎంత అందం గా ఆకర్షణీయంగా చేయవచ్చో క్రాంతీ ప్రెస్ ద్వారా నిరూపించిన సాహితీ మిత్రులు ధనికొండ హనుమంతరావు నిన్న సాయంత్రం విజయా హాస్పటల్ లో కన్నుమూశారు. నలుగురు కుమా రులూ, ఇద్దరు కుమార్తెలు - అందరూ పైకొచ్చారు. పెద్దబ్బాయి శ్రీధర్ఒక్కడే బాగా తెలుసు. ఈ కష్టసమయంలో 'ధనికొండ' కుటుంబసభ్యులకు మా గాఢ సంతాపం తెలియజేస్తున్నాము.

. . . . . 23

అలహాబాద్ బాంకు అడయారు బ్రాంచి మేనేజరు మణీనాగేంద్రరావు నిన్న టెలిఫోనులో, 'అశోకా హొటల్ లోని మా ఎగ్జిబిషన్ ఒకసారి వీలు చేసుకు వచ్చి చూడండి' - అన్నారు. "హిందూలో చదివాను - శనివారం పదకొండు గంటల వేళ వస్తాను" - అన్నాను. మాలతి ఊళ్లోలేకపోవటంవల్ల ఈ మధ్యాహ్నం శివస్వామిగారింట్లో భోజనం. 'అమ్మాయి హాస్పటల్ నుంచి వచ్చే వేళయింది - మీరూ గోపి వెళ్లి రండి' అన్నారు రాధ, చిదంబరంలో లెక్చరరైన రామ్ గోపాల్ (గోపి) సునిశిత దృష్టి గల యువకుడు. "ఎకనమిక్ అండ్ పొలిటికల్ వీక్లీలో 'నూరాని' రామజన్మ భూమి గురించి వ్రాసినది, అంకుల్, మీరు చదవాలి - ఆ కాపీ నాదగ్గిర వుంది" అన్నాడు గోపి, మార్గమధ్యంలోని మాటలలో.... అలహాబాదు బాంకుకి 125 ఏళ్లు. 1868 ఏప్రిల్ 24వ తేదీన అలహా బాదులో స్థాపితమైన ఈ బాంకు, 1885 లో కాన్పూరు, ఝాన్సీలలో బ్రాంచీలు తెరిచింది. తర్వాత లక్నో, బరిలీ, నైనిటాల్; కలకత్తా బ్రాంచి 1895 లో! 1923 లో 'పి-అండ్-ఒ బాకింగ్ కార్పోరేషన్'తో విలీనం కాగా, ప్రధాన కార్యాలయం అలహా బాదునుంచి కలకత్తాకు మారింది. ఈ ఎగ్జిబిషన్‌లో ఎన్నో అపూర్వమైనవి ఉన్నాయి - అనాటి తాళం, త్రాసు, లెడ్జర్లూ, టోకెనులూ, స్పెసిమెన్ చెక్కు, చక్కటి దస్తూరీతో అకవుంట్ పేజీలు

మొదలైనవి. అన్నిటికంటె ముఖ్యంగా అందరినీ ఎక్కువ ఆకర్షించేది జవహర్ లాల్ నెహ్రూ 1954 లో వ్రాసి ఈ బాంకులో భద్రపరిచిన విల్లు పత్రం- అయిదు ఫ్రేములతో ఎన్‌లార్జ్‌డ్ కాపీ.... 'గంగానదిలో నా అస్థికలు కలపమని కోరడం మతఛాందసత్వం కాదు - ఆ నదీజలాల జీవధార, ఆ తరంగలాస్యం సొగసు, ఆ గంగామాత చుట్టూ అల్లుకుపోయిన కథలూ గాథలూ భారతీయ సంస్కృతి అవడంవల్ల' అన్న పండిట్ నెహ్రూ పలుకులలో ఒక అమరసందేశం వినిపిస్తుంది. మొదటి పధ్నాలుగు జాతీయ బాంకులలో ఒకటైన అలహాబాదు బాంకుకి (Allahabad Bank) ఈనాడు 1700 బ్రాంచీలు ఉన్నాయి; 4500 కోట్ల వ్యాపారం; 21,300 ఉద్యోగులు .... ఆర్థికరంగంలో తాము చేస్తున్న కృషి ప్రజలకు తెలుపాలనే ప్రయత్నంలో 'అలహాబాద్ బాంక్' నిర్వహించిన ఈ ఎగ్జిబిషన్ అభినందనీయమగు ప్రయత్నం.

. . . . . 24

సాహిత్య అకాడమీవారు ట్రాన్స్లేషన్ వర్క్‌షాపులని మళయాళం, కన్నడం, తెలుగు భాషలలో నిర్వహించారు. ఇవ్వాళ తమిళ ట్రాన్స్‌లేషన్

వర్క్‌షాపు, అశోకమిత్రన్ సారథ్యం లో, తమిళాలజీ ప్రొఫెసరు పెరియ కరుప్పన్ అధ్యక్షతను, మాక్స్ ముల్లర్ భవన్‌లో ప్రారంభమయింది. ప్రాంతీయ కార్యదర్శి కృష్ణమూర్తి ఆహూతులకు స్వాగతం తెలిపిన మీదట, అనువాద ప్రక్రియలోని సాధక బాధకాలు, దిన పత్రికలకు నిత్యం కావల్సిన తర్జుమాలు, సార స్వత పరమగు భాషాంతరీకరణ గురించి మాట్లాడారు అశోకమిత్రన్. 'తిరు క్కురళ్ ఆంగ్ల అనువాదాలు 27 వున్నాయి; అందులో ఏ ఒక్కటీ అథారిటేటివ్ కాదు,' అన్నారు పెరియ కరుప్పన్. 'ప్రపంచ ప్రసిద్ధ రచనలు, ఎన్ని మన భాషలోకి తెచ్చుకుంటే, అంత పుష్టి వొనగూడుతుంది మన భాషకు' - అన్నారు జయకాంతన్. "చక్కటి అనువాదం పునః సృజన లాటిది. క్రైస్తవ సంస్కృతి తాను అరబ్ సంస్కృతి కంటె గొప్పదాన్న అనుకోవడం వల్లనే అనేక యుద్ధాలు సంభవించాయి. 19 వ శతాబ్దిలో జర్మన్ రొమాంటిసిజమ్ అవతరించే దాకా, క్రైస్తవ మౌఢ్యం ప్రజలను అజ్ఞానంలో అట్టే పెడుతూ వుండేది. షాజహాన్ కుమారుడైన దారా, ఉప నిషత్తులని పారశీకంలోకి అనువదించాడు. పారశీకం నుంచి అవి లాటిన్ లోకి వెళ్లాయి; లాటిన్ నుంచి ఫ్రెంచి లోకి: ఆ ఫ్రెంచి నుంచి జర్మన్ భాష లోకి వచ్చిన ఉపనిషత్తులు చదివి, ఫిలాసఫర్ షొఫన్‌హార్ ముగ్ధుడై, నాకీ ఉపనిషత్తులు జీవితానికీ, మృత్యువుకీ అర్థం తెలిపాయి - అన్నాడు. అను వాదాలు ఒక్కోసారి మాతృకకి మెరుగులు దిద్దుతాయి" అన్నారు మాక్స్ ముల్లర్ భవన్ డైరక్టరు షిండ్లర్. వారం రోజులపాటు వుంటుంది ఈ వర్క్‌షాప్.

. . . . . 25

జస్టిస్ రామానుజుల నాయుడు రమాదేవీ దంపతుల కుమారుడు చి॥ వెంకట రమణమూర్తికి, మాకెంతో సన్నిహితులైన శేషాద్రి, మోహన దంపతుల కుమార్తె సౌ॥ మీనాక్షికి 'దాసప్రకాష్'లో సాయింత్రం ఆరున్నరకి నిశ్చితార్థం. డ్రయివరు జోసఫ్‌కి క్రిస్టమస్ పండుగ సెలవు. అంచేత రమణయ్యే రాజా తీసుకు వెళ్లారు.... అవార్డ్ సందర్భంగా గోపాలరెడ్డిగారిచ్చిన ఉపన్యాసం మెచ్చుకుంటూ, సీనియర్ పార్లమెంటేరియన్ యన్ జి రంగా వ్రాసిన లేఖ రాజాగారికి చెప్పాను - లోకాభిరామాయణంలో!

. . . . . 27

మద్రాసు ప్రెస్ క్లబ్బూ, ఆదర్స్ గిల్డ్ ఆఫ్ ఇండియా - మద్రాసు చాప్టరూ సంయుక్తంగా ప్రెస్ క్లబ్ ఆవరణలో 'పిరియాడికల్ జర్నలిజమ్ - ప్రాబ్లెమ్స్ అండ్ ప్రాస్పెక్టస్' (Periodical Journalism- Problems and Prospects) అనే అంశంపై 'రీడర్స్ డైజెస్ట్' ప్రధాన సంపాదకులు అశోక్ మహాదేవన్ ప్రసంగం ఏర్పాటు చేశారు. ఎమరైన్సీ

తర్వాత పిరియాడికల్ జర్నలిజమ్‌కి మన దేశంలో ఒక 'బూస్ట్' వచ్చిందనీ, ఢిల్లీ బొంబయి నగరాల నుంచి ఆంగ్లంలో అనేక కొత్త పత్రికలు ఆవిర్భవించి, సంపన్న మధ్య తర గతిని ఆకట్టుకున్నాయనీ, పదిహేనే ళ్లలో 'ఇండియా టుడే,' రెండేళ్లలో 'పెరేడ్' సాధించిన విజయం గణ నీయమనీ, పిరియాడికల్స్ ఎప్పుడూ స్పెషల్ ఇంటరెస్ట్‌నీ, జనరల్ ఇంట రెస్ట్‌వీ అయి వుంటాయనీ, 216 దేశ ప్రఖ్యాత పిరియాడికల్స్ ఈనాడు మార్కెట్లో ఉన్నాయనీ చెప్పారు అశోక మహదేవన్.... ఉప న్యాసం వివరంటా వినాలని ఉన్నప్ప టికీ యూనివర్సిటీ ఆడిటోరియమ్‌కి ఆరున్నరకి వెళ్లవలసి వచ్చింది - ఫెస్టివల్ ఆఫ్ ఫ్రాన్స్, ఐసిసి ఆర్ సహకారంతో (Festival of French India 1989 - ICCR) సైక్లోప్ వారి ఫ్రెంచి రాక్ మ్యూజిక్ (France Rock Music by CYCLOPE) సన్నని సంగీతానికి అలవాటు పడ్డ శ్రోతలకు ఈ రాక్ మ్యూజిక్ ఫెళా ఫెళార్భటులతో వినిపిస్తుంది. అయితే, యువతీ యువకులని యిది సమ్మోహ పరచడానికి గల కారణం? ఆ ధ్వని తరంగాలు మన శ్రవణేంద్రియం ద్వారా రక్త ప్రసారంపై ప్రభావం చూపుతాయి. నిర్ణిద్రహృదయ స్పంద నకు, ఆ ధ్వన్యాలోకానికి అదృశ్య బంధం ఉంది. సన్నాయి పాటకు, బ్యాండు మేళానికీ, డప్పు వాద్యానికి గల భేదం మనకి తెలుసు. డప్పుల

# సుముఖ చిత్రం

1953 'పుట్టిల్లు'తో వెండితెర కెక్కిన జమున, 1954 లో 'పణం' అనే తమిళ చిత్రంలో, 1955 లో 'మిస్సియమ్మ' కన్నడంలో, 1957లో 'మిస్‌మేరీ' హిందీలో - యిలా నాలుగు భాషలలో (అధికంగా తెలుగు లో) 155 చిత్రాలలో నటించి, 1978 ఏప్రిల్ 17 వ తేదీ శ్రీరామ నవమినాడు, హైదరాబాదు లాల్ బహుదూర్ స్టేడియమ్‌లో రజతోత్సవ వేడుక జరుపుకున్న సందర్భంగా, నారాయణరెడ్డి ఈమెను 'పడుచు వాళ్లకు మనోహారిణి, పెద్దవాళ్లకు స్వప్న సంచారిణి' అన్నారు; 'ఈ నాటికీ పెళ్లికూతురులా కనిపించే జమున, వృద్ధ కళాకారుల సేవకోసం కొత్తబాట వేస్తున్నారు' - అన్నారు అప్పట్లో ఆంధ్రా హైకోర్టు ప్రధాన న్యాయమూర్తి అయిన ఆవుల సాంబ శివరావు. 'పాతికేళ్లుగా మా నాయకీ మణి!' అని శుభాభినందన తెలిపారు యన్‌టి రామరావు. జనతా ప్రభుత్వం లోని కేంద్ర సమాచార మంత్రి అద్వానీ ఆనాటి ముఖ్య అతిథి. డ్రీమ్ గరల్ హేమమాలిని కళాభారతి జమునని 'ప్రజానటి' అనే బిరుదుతో సత్కరిం చారు. అయితే, పార్లమెంటేరియన్‌గా ప్రజాసేవ చేసేందుకు పన్నెండేళ్లు వేచి వుండి వలసి వచ్చింది - పట్టువిడవని విక్రమార్కుని పోలిన జమునా రమణ రావుకు.

చప్పుడుకీ గుండె గానానికీ గల మైత్రి ప్రాచీన సమాజాలకి తెలుసు. ధ్వనిని విస్తృత పరచగల విద్యుత్ సంపదతో అధునిక సంగీత పరికరాలతో, హెచ్చు శృతిలోని గాత్రంతో, అది 'రాక్ మ్యూజిక్' అయిందని అని పించింది.

. . . . . 28

స్త్రీ పురుషుల వ్యక్తిత్వాన్ని సమాన గౌరవంతో చూసి, భారతనారిని స్వాతంత్ర్య సమరంలోకి దింపడం ద్వారా ఆమె అంతస్థుని పెంచి, అవ లీలగా ఆమెకు సమాన హక్కు వచ్చే టట్టు చేసిన పూజ్యబాపూజీ ఆశయా లను త్రికరణ శుద్ధిగా అచరణ పెట్టిన నిరుపమాన స్వచ్ఛంద సంస్థ 'స్త్రీ సేవా మందిర్', నలభై సంవత్సరాలు నిండిన సందర్భంగా, అక్టోబరు రెండవతేదీన ప్రారంభించిన ఫెస్టివల్‌కి ఇవ్వాళ 'సబర్మతి'లో ముగింపు సమావేశం. 'Where the mind is led forward by Thee into ever widening thought and action' అనేది వారు మనస్ఫూర్తిగా నమ్మిన సిద్ధాంతం. స్త్రీ సేవా మందిర్ స్టాఫ్ ఈ నాడు 450. ఇంతవరకూ పదిహేను వేల మంది స్త్రీలకు వేర్వేరు వృత్తులలో శిక్షణ నిచ్చారు; అయిదువందల మంది స్త్రీలకు పునరావాసం కల్పిం చారు. ఆత్మబలంతో స్వశక్తితో స్త్రీ నిలబడ గలగాలి అనే ఆశయ లక్ష్యంతో వారు చేస్తున్న కృషి నిర్వా రామమూ, అనంతమూను. 40వ వార్షి కోత్సవ సందర్భంగా 'సృజన' అనే భవన నిర్మాణానికి శంకుస్థాపనగావిస్తూ 'ఇండస్ట్రియల్ డెవలప్‌మెంట్ బాంక్ మద్రాసు బ్రాంచి మేనేజరు అర్‌హెచ్ పాటిల్ స్వచ్ఛంద సేవా సంస్థలు నిర్వహింపబూనే పరిశ్రమలకని కేటా యింపబడ్డ కోటిరూపాయిలు ఎవరె వరికివ్వాలో, మా పరిమితులకు లోబడి ఎలా వ్యయపరచాలో తెలియక, మేమే స్వయంగా కలుసుకు, 15 లక్షలు అప్పుయిస్తాం ఏదైనా పరిశ్రమ చేబట్టం డని అడిగాము, అని అన్నారంటే, అది 'స్త్రీ సేవా మందిర్' సంపాదించుకున్న ధవళ కాంతికి నిదర్శనం 'అప్పిస్తాం పుచ్చుకోండి' అని ఒక బాంక్ అడగటం నమ్మలేని విషయం. కాని, అది సంభ వించింది. మిసెస్ ఎసి కృష్ణారావు ఈ నలభై ఏళ్లలో, సామాన్యులు నమ్మ లేనంత విస్మయకరంగా, స్త్రీ సేవా మందిర్‌ని శాఖోపశాఖలుగా పెంచారు. ఆమెకు మార్గ జ్యోతి అయిన దుర్గా బాయ్ దేశ్‌ముఖ్ అంటూండేవారు: 'సోషల్ సర్వీసుకి కావలసినది డబ్బు కాదు - లక్ష్యానికి కట్టుబడి నడుచుకో గల వ్యక్తులు - పదిమందికి పనికొచ్చే మంచి చేస్తున్నామంటే, డబ్బు అదే వస్తుంది.' - ఆమహనీయురాలి మాట లను మనసా వాచా కర్మణా అచరణ లో పెట్టారు మిసెస్ ఎ సి కృష్ణారావు. ఇండస్ట్రియల్ డెవలెప్‌మెంట్ బాంక్ (అర్ హెచ్ పాటిల్), స్టేట్ బాంక్ అఫ్ ఇండియా (వి సుబ్బారావు), ఇండియన్ బాంక్ (ఎమ్ గోపాలకృష్ణన్) కెనరా బాంక్ (టి ఎ ఏకనాధన్) - ఈ నాలుగు బాంకులకి చెందిన పెద్దలు





# స్వాతంత్ర్య మూల స్తంభాలు

నవంబరు 4వ వారంలో మన పురుషులు,
స్త్రీలు, యువకులు, వృద్ధులు
మిలియన్ల సంఖ్యలో తమ ఓటు హక్కును
వినియోగించుకున్నారు

ఇతరత్ర వీచే పరివర్తనల గాలులలాగే
మన దేశంలో కూడ ప్రజాస్వామ్య రీతిలో,
సులభంగా సాఫీగా ప్రభుత్వ పరివర్తన
జరిగింది

9వ లోక్‌సభ ఎన్నికలు మరోసారి
ప్రపంచానికి తేటతెల్లం చేశాయి
స్వాతంత్ర్యం-ప్రజాస్వామ్యం పట్ల
మనకున్న అచంచల విశ్వాసమే
మన బలమని నిరూపించాయి.

ఆ విశ్వాసం, ఆ స్వాతంత్ర్య జ్వాలల్ని
మనం పరిరక్షించుకోవాలి





ప్రజల వాక్కు ఇది
జాతి వాక్కు ఇది

davp 89/970 Tel

వేదికమీద ఉన్నారంటే, ఒక స్వచ్ఛంద సేవాసంస్థ చేస్తున్న సోషియో - ఎకనమిక్ ప్రోగ్రామ్స్‌పట్ల, జాతీయ బాంకింగ్ చూబుతున్న ఆసక్తికి ఉదాహరణ - అని మెచ్చుకున్నారు, ఒకనాటి కేంద్ర ఫైనాన్స్ మినిస్టరైన సి. సుబ్రహ్మణ్యం - ఈనాటి సభకు అధ్యక్షత వహిస్తూ! జమ్నాలాల్ బజాజ్ అవార్డ్, నేషనల్ యూనిటీ అవార్డ్, మద్రాసు తెలుగు అకాడమీ అవార్డ్ - ఇలా ఎన్నో ప్రశంసలు పొందిన మిసెస్ ఎసి కృష్ణారావు, స్త్రీ విద్యకు, నిర్భాగ్యస్త్రీల పునరావాసానికి, శిశు సంరక్షణకు, స్త్రీల వృత్తి విద్యావకాశాలకు స్థూలంగా మహిళా జనోద్ధరణకు, స్త్రీ సేవా మందిర్ ద్వారా చేస్తున్న అవిరళ కృషి అభినందనీయం. "ముప్ఫయ్యేళ్ల పాటు దేశపాలనలో పాలు పంచుగొన్న నాకు, ప్రభుత్వపరంగా జరిగే సమాజ సేవా కార్యక్రమాలకు, స్వచ్ఛంద సేవాసంస్థలు చేసేదానికీగల తేడా స్పష్టంగా తెలుసు - ఇది తృప్తినిచ్చే కమిట్‌మెంట్. అటువంటి కమిటెడ్ వర్కర్స్‌తో స్త్రీ సేవా మందిర్ యింకా యింకా విస్తరిల్లి, మహిళా లోకాన్ని జాగృతం చేయాలని నా ఆంకాక్ష" అన్నారు ఎల్డర్ స్టేట్స్‌మాన్ సుబ్రమణ్యం. సావనీర్ విడుదల చేసిన వి సుబ్బరావు - తమ స్టేట్ బాంక్ ఆఫ్ ఇండియా వారి గిఫ్ట్‌గా ఒక జెనరేటర్ స్త్రీ సేవా మందిర్‌కి బహూకరించారు .... 'అభినయ దర్పణ' దర్శకురాలైన ధనలక్ష్మి, కూచిపూడి ప్రదర్శన నారద గానసభలో. నాట్యకళకు అంకితమైన ధనలక్ష్మి, తన విద్యా పాటవంతో ప్రేక్షకులని మెప్పించారు. శతకోటి మన్మధాకారుని సరసకు చేరాడు త్రిజగమ్ములు మోహమున ముంచే కృష్ణశాస్త్రి 'రంగశాయి'.

—యన్నార్ చందూర్

## మనవి

మీరు విన్నవీ మీ అనుభవంలో వున్నవీ పదిమందికి చెబితే బావుంటాయనుకొనే జోక్స్, నిమ్మతొనలు శీర్షికలో ప్రచురింపబడతాయి. ఈ పత్రికకు సంబంధించిన సూచనలకు, విమర్శలకు 'పాఠకుల తీర్పు'. ప్రచురణ నిమిత్తం పంపే రచనలతోబాటు పోస్టుబిళ్లలు అతికించిన పొడుగు కవరు వుంటేకాని అంగీకారం కానివి వెనక్కి పంపడం సాధ్యం కాదు. మాఊళ్లో 'జ గ తి' దొరకడం లేదనేవారికి ఒక్కటే మనవి - చందాదారులుగా జేరమని! రెండు సంవత్సరాలకి అంటే 24 సంచికలకు, నలభైఅయిదు రూపాయిలు.

JAGATI Monthly, 2, Kutchery Road, P. B. 2922 - Madras-600 004



?

"Dad, I would like to know what prompted Sage Valmiki to compose 20,000 verses of Ramayana. Not *Krouncha Mithuna* story - besides that ?"

"That episode was only a sequel to what Narada had already communicated to him," said Raghu's Father.

"Oh, Narada is here too. He seems to be an all-pervading phenomenon," commented Raghu.

"Narada is a much misunderstood benefactor who contributes his crucial bit to the health and happiness of everyone concerned. Umpteen times he has demonstrated the victory of Virtue over Vice. When Narada, in one of his usual rounds, called on Valmiki, in a casual manner the sage asked him whether there could exist a valiant, handsome, pious. honest and truthful person, Narada was quick to reply. 'There is that King of Ayodhya by name Rama. And he narrated the life of Rama and his achievement. After Narada's departure, Valmiki has gone to River Tamasa for a dip and he chanced to witness the cruelty of the bowman to one of the two lovely birds. His immense grief *Soka* assumes the form of *Sloka* with 'Haa Nishada.' and the story he just than heard blossoms into a most beautiful *Kavya* extolling all that is good for Man," explained Raghu's Father.

---





# నా చిన్ననాటి ముచ్చట్లు

## కెయన్ కేసరి



'గృహలక్ష్మి' కంకణ గ్రహీతలైన తెలుగు వనితలు ఈనాడు ఎందరో ఉన్నారు. 'గృహలక్ష్మి' పత్రిక ద్వారా స్త్రీజనాభ్యుదయానికై కేసరిగారు చేసిన అద్వితీయ కృషి తెలుగువారు మరువలేనిది. అలాగే కేసరీ కుటీరం, కేసరీ విద్యాలయం వంటివి, ఆయన పేరు చిరస్థాయిగా నిలిపే సంస్థలు. ఆత్మబలం, స్వయంకృషి, అచంచల దీక్షతో, వైద్యశాస్త్రంలోని ప్రతిభను ప్రజోపకరంగా మార్చి, సేవా తత్పరతతో చరితార్థులైన కేసరిగారు తమ జ్ఞాపకాలను పుస్తకరూపంలో 1953 లో వెలువరించారు. ఆదర్శప్రాయులు, పుణ్యజీవనులు అయిన ఆ మహానుభావుని జీవితవిశేషాలు, ఆనాటి సాంఘిక పరిస్థితులకి దర్పణం వంటి అనుభవాలు - జులై 1989నెలనుంచి ధారావాహికంగా ప్రచురిస్తున్నాము.



దగ్గరయుండు శ్రీదేవి భూదేవులను మోసగించి, అప్పుడప్పుడు పూలరంగడు బీబీవద్దకు రాత్రిళ్లు పోయివచ్చునట. స్వామిపోయినరాత్రి అక్కడ సుగంధద్రవ్యముల పరిమళము మనోహరముగ నుండును. శ్రీరంగనాథస్వామి ముఖమున యుండు చందనము కూడ సుగంధద్రవ్యములతో కలిపియుండును. ఒక బిళ్లను ఒక రూపాయికి అర్చకులు అమ్మెదరు.

మళయాళము నందలి మధుర యందలి శిల్పచాతుర్యము ఇక్కడ తక్కువ, గాని దేవాలయముచాలా హేరాళముగ నుండును. సప్తప్రాకారములు చాలా వైభవంగా నుండును. బయటి ప్రాకారము ఎత్తు 20 అడుగులకు పైన యుండును. దానిపైన వెడల్పే 6 అడుగులు. 15 గాలిగోపురములు.

శ్రీరంగమునుండి తిరుచునాపల్లికి వచ్చి, అక్కడి వుచ్చిపిళ్లారి కొండనెక్కి పిళ్లారి (విఘ్నేశ్వరుడు)ని దర్శించితిమి. కొండమీదనుండి శ్రీరంగము తిరుచునాపల్లి పట్టణములను చూచిన చిన్నవిగను చిత్రముగను కనబడును.

తిరుచునాపల్లినుండి కుంభకోణం చేరితిమి. ఇక్కడ నాపరిచితులగు దివాన్ బహదూరు భాష్యమయ్యంగారు జడ్జిగ యుండిరి. వారింటిలో బస చేసితిమి. ఆ వూరిలో నాలుగు దినములుండి కావేరి స్నానం, దేవుళ్ల దర్శనము చేసుకొని చిదంబరము చేరితిమి.

ఈ కుంభకోణములో 16 దేవాలయములున్నవి; వానిలో 12 శివునివి; 4 విష్ణువువి. అన్నియు చూడదగినవే. సారంగపాణి (విష్ణు) దేవాలయము చాలా గొప్పది. ఇక్కడి గాలిగోపురం సుమారు 150 అడుగుల ఎత్తుండును. మెడ వెనకకు విరుచుకొని గాని శిఖరమును చూడజాలము. ఈ స్వామికి రెండు కొయ్య రథములున్నవి.

చిదంబరములో యొక నాటుకోటుశెట్టి వారి సత్రములో దిగితిమి. స్నానానంతరము నటరాజ దర్శనమునకు పోతిమి. చిదంబర రహస్యమును నటరాజు వైభవమును చూచి ఆనందించితిమి. అప్పుడక్కడ నందన్ చరిత్రము తలంపునకు వచ్చెను.

ముఖ్యముగ సరస్వతీబాయి చెప్పు నందన్ చరిత్ర హరికథ జ్ఞాపకమునకు వచ్చి మరియొకసారి నటన సభాపతికి ప్రదక్షిణముచేసి అక్కడనుండి పయనమైతిని.

చిదంబర దేవాలయం చాలా ప్రాచీనమైనది; ఇచ్చట ఏటేటా రెండు పెద్ద ఉత్సవములు జరుగును. అందొకటి, 'అణి తిరుమంజనం' రెండవది

'ఆరుద్ర దర్శనము' - 10 రోజులీ యుత్సవములు జరుగును. ప్రతిదినము లక్షలాది జనము వచ్చెదరట.

ఈ దేవాలయం ప్రాకారాదులతో కోట యున్నట్లుండును. 18వ శతాబ్ద మధ్యమున పరాసువారు ఆంగ్లేయులు, హైదరలీ క్రమముగా ఈ దేవాలయమును తమ కోటగా నుపయోగించుకొన్నారని చరిత్రలలో చెప్పుదురు. ఇందలి విశేషము శివకేశవాలయములు సమీప స్థలములై యుండుట యొకటి.

సామాన్యముగా వైష్ణవాలయాలకే వైభవమెక్కువ; ఈశ్వరాలయము లోని వైభవముకన్నా మహిమ హెచ్చుగా కన్పించును. ఇచ్చట అట్లు కాక నటరాజస్వామి ఆలయమున వైభవము హెచ్చుగా నుండును.

శ్రీ నటరాజ స్వామి నృత్య మండపము యొక్క ఆచ్ఛాదనము బంగారు రేకుతో తాపటము చేయబడినది. శ్రీ నటరాజస్వామి ఆ మంటపమున ఒక కాలెత్తి తగు హస్తవిన్యాసమున తాండవించుచున్నట్లు ఆ విగ్రహము సొంపు ఎన్నేళ్లైనను మరువజాలము. ఎన్నాళ్లనాడో చూచిన ఆ విగ్రహము శ్రీమతి యం. యస్. సుబ్బలక్ష్మి అమ్మాళ్ 'కాలైతూక్కి' అని పాట పాడగా విన్నప్పు డెల్లను కన్నుల ఎదుట ప్రత్యక్షమగుచుండును. స్వామికి వెనుక ప్రక్కన నల్ల చలువరాతితో కట్టబడిన పవ్వళింపు సేవామందిరమును ఎంతో మనో హరముగా నుండును.

మామూలుగా చిదంబర రహస్యమందురు. అనగా నేమియులేదు. ఇచ్చట లింగము 'ఆకాశలింగము' లేక 'వాయులింగము'. హిందూ వేదాంత శాస్త్రరీత్యా పంచభూతములలో వాయువును ఆకాశమును వేర్వేరు భూతము లైనను - రెండును అగోచరములే. 'ఆకాశం గగనం శూన్యం' అన్నారు.

ఆ లింగమున్నచోట తెర వేయబడి యుండును. భక్తుల దర్శనార్థమై చేరినప్పుడు ఆ తెరనటు తొలిగించి, ఇటు మరల మూయుదురు. అంతా క్షణములో జరుగును. కావున ఎవ్వరు చూచునది కాని, కన్పించునది గాని ఏమియు లేదు. అదియే చిదంబర రహశ్యము. సదాశివుడు నటరాజ మూర్తియై సకలేంద్రియములును తన్మయత్వ మొంద-నృత్యభంగిమ చూపు చుండగా - ఆ రహస్యమును తెలుసుకొనుటకై ఎవ్వడు తంటాలుపడును? కన్పించినా కన్పించకున్నా చూచి భక్తి భావమున నమస్కరించవచ్చును.

## పక్షితీర్థము (తిరుకైకుంద్రము)

చంగల్పట్టు రైల్వేస్టేషన్‌లో దిగి సమీపమున యుండు పక్షితీర్థమను క్షేత్రమునకు పోయి సత్రములో గది శంఖుతీర్థమున స్నానము చేసి కొండ

నెక్కితిమి. సుమారు 11 గంటలకు ఒక పండారము చక్కెరపొంగలిని వండు కొని కొండపైకి వచ్చి పక్షులను చెయ్యితట్టి పిలుచును. అప్పుడు రెండుగాని మూడుగాని పక్షిరాజులు వచ్చి పండారము వద్ద వాలును. అవి ఆ ప్రాంత ముల కొండగృహలనుండి వచ్చుట చూడనగును. అయితే అవి ఒకటి కాశీ నుండియు, మరియొకటి రామేశ్వరమునుండియు వచ్చినట్లు తీర్ధప్రజల కతడు చెప్పును. పక్షిరాజులు వచ్చినవెంటనే పండారము వాటికి స్నానముచేయించి, తిరుమణి శ్రీ చూర్ణముతో అలంకరించితెచ్చిన చక్కెరపొంగలిని పక్షులకు పెట్టును. పక్షిరాజులు తినగా, మిగిలిన ప్రసాదమును వచ్చినవారందరికి పంచి పెట్టును. ఆ పక్షులు వచ్చినత్రోవనే మరల యెగిరిపోవును. ఈ ప్రకారము దినము జరుగుచుండును. వందలాది సంవత్సరములుగ పక్షులు యిక్కడికి వచ్చి దర్శనమిచ్చుచున్నట్లు స్థళపురాణము గలదు. పక్షులను చూచిన చాలవయసు చెల్లినవిగ కనబడును. ఆ పండారము తీర్థయాత్రికులను ప్రసాదము స్వీకరింప గోరుచు క్రమముగా హిందీ, తెలుగు, తమిళములలో ఉపన్యసించును. కొండక్రిందయుండు శంఖుతీర్థమున 12 సం॥ కొకసారి శంఖమొకటి గొప్ప ధ్వని చేయుచు, పైకిలేచునని, అక్కడివారు చెప్పెదరు. అక్కడ పుట్టిన శంఖములను కొండమీది స్వామివద్దపెట్టి పూజించెదరు. ఈ కొండ ప్రద క్షణమును చేసినను, ఈ పక్షితీర్థమును పానముచేసినను సమస్తవ్యాధులు నిర్మూలనమగునను తలంపుతో జనులు యిక్కడకు వచ్చి సత్రములలో కాపుర ముండెదరు.

## కాంచీపురం

ఈ పురాతన క్షేత్రమునకు వచ్చి దిగితిమి. వరదరాజస్వామి దేవా లయమున అర్చన వగైరాలను జరిపించి గుడిలోయుండు బల్లిని తాకితిమి. ఈ బంగారు బల్లిని తాకినవారికి బల్లి పడిన దోషముండదు. ఈ దేవాలయమున అయ్యంగార్లు కంచి యిడ్డిలిని తయారుచేసి విక్రయించెదరు. ఈ యిడ్డిలి 10 దినముల వరకు చెడిపోక బాగుండును. ఒక యిడ్డిలివి సుమారు 10 మంది వరకు ఆకలి తీరునట్లు భుజించవచ్చును. దీని వెల అప్పుడు రు 2 లు. ఇక్కడి పుళిహోర కూడా రుచిగా నుండును. ఎక్కడ పోయినను వైష్ణవ దేవాలయము లలో ఫలహారములు బాగుగ లభించును.... పిమ్మట కంచి కామాక్షిని పూజించితిమి.

మరునాడు ఏకామ్రేశ్వర దేవాలయమునకు పోతిమి. సామాన్యముగా నీ దేవుని, పామరులు (కొందరు పండితులును) ఏకాంబరేశ్వరుడు అందురు.

అది పొరబాటు. దేవి ఈశ్వరునికై మామిడిచెట్టుక్రింద తపమాచరించెననియు, ఈశ్వరుడు యచ్చట ప్రత్యక్షమై దేవిని వివాహమాడెననియు కథ. అదిలింగ మని చెప్పబడునదొక్క టొక్క మామిడిచెట్టు క్రిందనున్నది. ఆ మామిడి చెట్టు చాలాపురాతనమని చెప్పుదురు. దానికి నాల్గుశాఖలుండును. అవి వేద శాఖలనియు అక్కడివారందురు. మామిడి అనగా సంస్కృతమున 'ఆమ్రము' కావున ఒక్క మామిడిచెట్టుక్రింద వెలిసిన దేవుని ఏకామ్రేశ్వరుడు అందురు. (బ్రౌణ్యనిఘంటువులో : ఏకామ్రేశుడు - An epithet of Siva as worshipped at the pagoda at Conjeevaram under a 'single mango tree'.

ఈ దేవాలయమును నాటుకోటు శెట్లు లక్షలాదులను ఖర్చు పెట్టి మరల కట్టించిరి. అక్కడి నల్లరాతి స్థంభముల మీద చెక్కబడియుండు విగ్రహములు చూడదగినవి. శ్రీ ఆదిశంకరులవారి విగ్రహమున్ను ఈ దేవాలయమున నున్నది. ఈ దేవునికి అర్చన అభిషేకములను చేయించి స్వామి శెలవు తీసుకుంటిమి. వరదరాజస్వామి దేవాలయమున దొరికినట్లు ఫల హారములు యిక్కడ మాకు దొరకలేదు. మారేడుదళము, భస్మము మాత్రమే లభించినవి. అయితే అక్కడి వాతావరణము నిరాడంబరముగను, నిశ్శబ్ద ముగను, గంభీరముగఉండి వైరాగ్యమున కనువుగానుండును.

## కాళహస్తి

సాలెపురుగునకు, పామునకు, ఏనుగునకు మోక్షమిచ్చిన ఈశ్వరుని క్షేత్రమగుటచే 'శ్రీకాళహస్తి' అని దీనినందురు.

ఇదియును పురాతనమైన మహాక్షేత్రము. రాజ పరిపాలన క్రింద యుండెను. ఆ పురాతనపు విశాలమైన రాజవీధులను నగళ్లను చూచినప్పుడు కంట నీరు కారును. ఏమూలచూచిన శిధిలమైన రాజగృహములే. లెక్క లేనన్ని బోడిలింగములను పట్టణమంతయు చూడవచ్చును. ఈవూరు మేలయిన కొయ్యదువ్వెనలకు ప్రసిద్ధి కెక్కినది. పల్లెటూరివారు కట్టుకొను కోకలను నేయు నేతగాంద్రకు యీవూరు పేరుపొందినది. ఈ వూరిలో యుండు శిధిలమైన శివాలయమునుకూడా నాటుకోటు శెట్లు మరల కట్టించిరి. అయితే అప్పటికి పూర్తిగ కట్టలేదు. ఈశ్వరునకు తుమ్మిపూల అర్చన విశేషము గనుక ఈ దేవాలయములో తుమ్మిపూలమాలలను సుందరముగ కట్టి విక్రయించు చుందురు. స్వామిని దర్శించుటకు పోవువారందరు తుమ్మిపూల మాలలను తీసుకొని పోయి లింగమునకు అలంకరించెదరు. ఈ వూరిలో నాకు మంచి స్నేహితులు శ్రీ N. సాంబయ్యగారున్నందున వారింటిలోనే బస చేసితిమి.

ఊరి ప్రక్కన సువర్ణముఖీనది యున్నది. అందలి యిసుకలోనుండి బంగారము తీయవచ్చునట. పాశ్చాత్య పరిశోధకులింకను పరీక్షించినట్లు తోచదు. ఊరి నంటి చిన్నకొండ, తిప్పలున్నవి. ఆ తిప్పలమధ్య భరద్వాజాశ్రమమున్నది. అందొక తిప్పపై మూరెడు పొడవున దుబ్బుగాపెరుగు గడ్డియొకటి గలదు. ఆ గడ్డి భూమినుండి తీయకే పిడికెడు పోచలు చేతబట్టి ఏదైనను కోరుకొనుచు ముడివేసినచో ఆ కోరిక ఈడేరునని చెప్పుదురు. వెళ్లిన యాత్రికులందరున్నూ ఆ పని చేసి వచ్చుచుందురు.

## తిరుపతి

ఇక్కడి నుండి ఏడుకొండలవానిని దర్శించుటకు తిరుపతి వెళ్లితిమి. తిరుపతిలో ఒక యింటిని బాడుగకు తీసుకొని దిగితిమి. కొండకు నడిచియే నిదానముగ యెక్కగలిగితిమి. కొండపైకి పోయి యిరువురము క్షౌరకల్యాణమును చేసుకొని, తీర్థస్నానమును చేసి, వెంకటరమణుని దర్శించి, అర్చించి, కర్పూరహారతి నిచ్చితిమి. చెల్లనికాసులను కొండికాసులను స్వామిహుండిలో వేసి నమస్కరించితిమి. అచ్చట మూడుదినములుండి దిగువతిరుపతికి వచ్చి స్వామిభార్య అలిమేలుమంగతాయారును దర్శించి కుంకుమార్చనను చేసితిమి.

తిరుపతి – ఎగువ తిరుపతి, దిగువ తిరుపతి - అని రెండుభాగములు. కొండక్రింద భాగము దిగువ తిరుపతి ; పైభాగము ఎగువ తిరుపతి.

దిగువ తిరుపతిలో గోవిందరాజస్వామి దేవాలయము చాల పెద్దది. యాత్రికులందరు ముందు దానిని దర్శింతురు. ఆ పిదప దిగువ తిరుపతికి ఒకమైలు దూరమున నుండు కపిలతీర్థంలో ఘునిగి మరీ కొండ ఎక్కుతారు. అదియొక జలపాతంవల్ల ఏర్పడ్డ కొలను. ఆ జలపాతం ఒక హనుమంతుని విగ్రహముపై పడుచుండును. ఈతనేర్చినవారు ఈది వెళ్లి హనుమంతుని తలపై కూర్చుండి జలపాతస్నానము నేరుగా చేసివస్తారట.

కొండకు 5 మైళ్లదూరము నిలువున ఎక్కుదురు. మొత్తము 7 కొండలు ఎక్కవలెను. మధ్య మధ్య అడవులు, తిప్పలు, సమతలములు ఉండును. ముఖ్యముగా మోకాళ్లపర్వత మెక్కుట చాలకష్టతరము. పూర్వము కష్టపడి ఎక్కేవారు ; ఓపిక లేనివారు డోలీలలో మోయించుకొని వెళ్లేనారు. ఇప్పుడు రోడ్డు వేయబడినది ; బస్సుకూడా నడుచుచున్నది. అయితే అన్నిటికి వలెనే ఈ బస్సు ప్రయాణమునకున్ను బ్లాక్‌మార్కెట్టు ఏర్పడినదని వెళ్లి వచ్చిన యాత్రికులు చెప్తున్నారు.

మొదట ఈ పర్వతం మెరుపర్వతంలొ భాగమని - వాయుదెవునిక, ఆదిశేషునికి వాగ్వాదమురాగా మేరుపర్వతభాగమును తన పగడపై నెత్తుకొని ఆదిశేషుడు తన మహిమ చూపగా, వాయువా పర్వతము నెగురగొట్టి తనశక్తి చూపెనట. ఆ ఎగిరి వచ్చిన పర్వతము - ఇట్లు ఈ ప్రదేశమున పడి తిరుపతియైన. తొలినామధేయము శేషశైలము లేక శేషాచలము.

ఎగువ తిరుపతికి వెళ్లినవారు ముఖ్యముగా పుష్కరిణియందు స్నానము గావింతురు. ఆ కొలనుయందు పాచి నిండియుండును. అయితే అందలి స్నానము కలుషహారమని అందరు ముక్కుమూసుకొనియైన స్నానము చేతురు.

దేవాలయమునకు మూడుమైళ్ల దూరములో మరియొక కొలను 'పాపవినాశం' అని గలదు. ఇది జలపాతముతో కూడిన కొలను. ఇదియు పాపహరము. ఇందు స్నానమొనర్చెవాని పాపముల పరిమితినిబట్టి నీరు నలుపుగా కన్పించునట.

శ్రీ వెంకటేశ్వరస్వామి వారి విగ్రహములు చాల సుందరమును గంభీరమునై 7 అడుగుల ఎత్తున యుండును. ఈ విగ్రహము తొలుత శైవమనియు, శాక్తేయ మన్నియు పండితులందురు. అందుకనుగుణ్యముగా జటాజూటాము ; ఫణిహారములు మున్నగు శైవచిన్నెలు విగ్రహమున నుండుటయు, శివప్రీతికరమగు బిల్వపత్రిపూజయు, శాక్తేయమగు శుక్రవారపు కుంకుమ పూజయు స్వామికి జరుగుచుండుటను ఆ పండితులు తార్కాణముగా నుదహరింతురు.

మానుముంతలను, కొయ్యబొమ్మలను కొన్నిటిని కొనుక్కొని బోడి గుండ్లతో మద్రాసుకు వచ్చితిమి. తీర్ధయాత్ర సమారాధనను చేసితిమి. తిరుపతి ప్రసాదమును అందరికిని భోజనకాలమందు పంచిపెట్టి సంతృప్తుల మైతిమి.

# 15 కేరళ దేశాచారములు

## శంకరుని శాపము.

కొన్ని సంవత్సరములకుముందు నేను తిరుచూరు మకాములో ఉండగ మాఇంటి మదురుగోడ ప్రక్కన పెద్దమంటలు మండుట చూచితిని. ఆ మంట యేమని మా యింటిలోని వారి నడిగితిని. కేరళరాజ్యమున మృతిజెందిన వారి

కళేబరములను ఇంటివారి దొడ్డితోటలలోనే దహనముచేయు ఆచారము కేరళ దేశమునగలదని వారు చెప్పిరి. రాత్రి మన ప్రక్క ఇంటిలో నొకరు చని పోయినందున వారి నక్కడ కాల్చుచున్నారని చెప్పిరి. ఆ మాట వినినతోడనే నాకు చాల ఆశ్చర్యము గలిగి నేనామదురు గోడవద్దకుపోయి కాలుచున్న కళే బరమును చూడగలిగితిని.

ఈ రాజ్యమున ఈ విధముగ శవదహనమును చేయుటకు కారణ మేమని వారిని నేను ప్రశ్నించితిని. అప్పుడు వారు నా ప్రశ్నకు ఈ క్రింద వ్రాసిన శంకరుని చరిత్రను విపులముగ చెప్పగలిగిరి.

ఈ రాజ్యమున నుండు ప్రతి పాఠశాలలోను ప్రసిద్ధ పురుషుడగు శంకరా చార్యుల జీవచరిత్రను బాలబాలికలకు బోధించెదరు. గనుక వారిని గురించిన విషయములన్నియును వీరికి దెలియును.

ఈ తిరుచూరుకు సమీపముననే కాలడి అను పల్లెటూరుగలదు. ఈ గ్రామమున శివగురు అనునొక ప్రసిద్ధ నంబూదిరీ బ్రాహ్మణోత్తము డుండెను. వీరికి ఆర్య యను నొక సతీ తిలకముండెను. ఈ శివగురు సకల శాస్త్రసంప న్నుడై ధర్మపత్నితోగూడి యజ్ఞయాగాది క్రతువుల నొనర్చి కేరళరాజ్యమున ప్రసిద్ధి చెందియుండెను. ఈ బ్రాహ్మణునకు వయసు చెల్లుచుండినను సంతాన సంపద లేకయుండెను. అప్పుడా శివగురు ధర్మపత్నితో సహా వృషగిరి అను శివగురుక్షేత్రమునకు వెళ్లి అక్కడ శివభజనను చేయుటకు ప్రారంభించెను. అప్పుడు శివుడు వారి భక్తికి మెచ్చుకొని పుత్రసంతానము గలుగునటుల వారికి వరమిచ్చి అనుగ్రహించెను. పిమ్మట కొంతకాలమునకు భార్యగర్భవతి అయి పుత్రుని గనెను. ఈ పుత్రుని చూచి శివగురునకు మితిలేని ఆనందము గలిగెను. ఈ బిడ్డడే విశ్వవిశ్రుతుడైన ఆదిశంకరాచార్యస్వామి. వీరు క్రీస్తుశకము 806 సం॥మునకు సరియగు కలివర్షం 3927 చైత్రమాసము 18 తేదిన కాలడి గ్రామమున స్వగృహమునందు జనన మందిరని కేరళమున పండితులు నిర్ణయించిరి. వీరి జననకాలము అనేకులు భేదాభిప్రాయమును దెలిపినను కేరళ పండితులు నిర్ణయించిన జననదివసమే సరి అని దేలుచున్నది.

శంకరుని జననము - మరి యొక కథ. శ్రీ శంకరాచార్యుల జననమును గురించి మరియొక కథనుకూడ ఇక్కడ చెప్పెదరు. శంకరుని తల్లి వైధవ్య మును పొందిన పిమ్మట శంకరుడు జన్మించినట్లు చెప్పెదరు. తల్లి సంతానము లేక పరితపించుచు ఈశ్వరుని ధ్యానించుచుండెనట. ఈశ్వరుడు కరుణించి తల్లి స్వప్నమున చనిపోయిన భర్త సంయోగమును అనుగ్రహించినట్లును, అప్పుడామె గర్భవతి అయి శంకరుని కనినట్లును కథకూడ గలదు. అయినను

భర్త లేకుండ ఆమె బిడ్డను కనినందులకు స్వజాతివారు ఆమెను కులభ్రష్టురాలు నిగ చేసి వెలివేసినట్లుకూడ కేరళదేశ చరిత్రయందు గలదు. ఈ కులభ్రష్టురాలికి పుట్టిన పుత్రుడే జగద్గురువు శ్రీ శంకరాచార్య స్వాములువారు. ఇట్టి మహాత్ములు మరెందరున్నారో ?

శంకురునకు మూడవ సం॥ము వయసు-దాటకమునుపే తండ్రి పరమపదించెను. అప్పటినుండి బాలుడు తల్లి చాటుననే పెరిగెను. వీరి కుటుంబము చాల పేదదైనందున ఊరివారి సహాయముతో శంకరునకు ఉపనయనాది వైదికకర్మలను తల్లి చేయవలసి వచ్చెను. ఈ దేశపు నంబూదిరీ బ్రాహ్మణుల కులాచారముల ననుసరించి బాలునకు వేదాధ్యయనాది విద్యలను అక్కడి పండితులవద్దనే అభ్యసింపచేసెను. వీరు చిన్నతనముననే సర్వశాస్త్రముల నభ్యసించి గొప్పపండితులైరి.

శంకరునకు జ్ఞానప్రాప్తి సిద్ధించిన వెంటనే సన్యసించవలయుననే కోరిక మనసున దృఢముగ నాటుకొనెను. అయితే తాను సన్యసించిన వంశక్షీణమగునని తల్లి తలంచి సన్యసించుటకు ఆమె అనుమతివ్వదేమోనని సంశయించుచు యోచించుచుండెను.

ఇట్లుండగ ఒకనాడు శంకరుడు ఇంటి సమీపముననే యుండిన నదీ ప్రవాహమున స్నానము చేయుటకు వెళ్లెను. స్నానము చేయుచున్న శంకరుని కాలును నదిలో యుండిన మొసలి గట్టిగ పట్టుకొని బాధించుచుండెను. అప్పుడు బాలుడు బాధకు తాళలేక "అమ్మా-అమ్మా" అని ఆర్తనాదమున తల్లిని పిలిచెను. వీరి ఇల్లు ఆ నదీ సమీపముననే ఉండినందున కుమారుని కేకలు తల్లి విని మరి కొందరిని కూడా పిలుచుకొని వచ్చి కుమారుని అవస్థను చూచెను. వచ్చిన వారందరు కూడ బాలుని కాలును మొసలి విడిపించుటకు సర్వప్రయత్నములను చేసిరిగాని అది విడువలేదు.

అప్పుడు శంకరుడు తల్లినిచూచి "అమ్మా మొసలి వాతపడి చనిపోవుచున్న నాకు సన్యాసమును స్వీకరించుటకు నీవు అనుమతి నిమ్మ" అని దీనముగ తల్లిని ప్రార్థించెను. అప్పుడు కుమారుని కష్టములను చూచి సహింపలేక వెంటనే సన్యసించుటకు తల్లి అనుజ్ఞనిచ్చెను. తల్లి అనుమతి ఇచ్చిన వెంటనే కుమారునికాలు మొసలి విడిచి పారిపోయెను.

తాను సన్యసించుటకు తల్లి అనుమతిని తీసుకొనిన కొద్దికాలమునకే శంకరుడు తనకు సన్యాసమును ప్రసాదించుటకు తగుమైన గురువరేణ్యుడు యెక్కడున్నాడో యని వెతుకుటకు దేశయాత్రకు పయనమై తల్లి అనుమతిని గోరెను. అప్పుడు తల్లి కుమారుని చూచి "నాయనా నీవు నాకు యేకపుత్రుడవే.

నా శేషక్రియలు నీ చేతిమీదుగ చేయక నిన్ను దేశయాత్ర చేయుటకు నేనెట్లు సమ్మతింపగల" నని కంటనీరు కార్చెను. అప్పుడు శంకరుడు అమ్మనుజూచి, "నేను సన్యాసమును స్వీకరించి యేదేశమందుండినను నీ అంత్యకాలమున నీ ప్రక్కన యుండి అనంతరము అంత్యక్రియలను యధావిధిగ జరిపెదనని" తల్లితో ప్రమాణమునుచేసి వప్పించి ప్రయాణమై దేశయాత్రకు వెళ్లెను.

పిమ్మట శంకరుడు గురువును వెతకుచు దేశములు తిరుగుచు కడపట నర్మదా నదీతీరమున నివసించుచుండిన గోవిందాచార్యుల వారిని కనుగొనెను. అప్పుడు వారిని దర్శించి ఆశ్రయించెను. శంకరుడు గోవిందాచార్యులను చూచిన వెంటనే వీరే తనకు సన్యాసమును ప్రసాదింపదగిన పుణ్యపురుషులని తలంచి తన కథ నంతయు వారికి చెప్పెను. అప్పుడా గోవిందాచార్యులు ఈ నూతన శిష్యుని ముఖ తేజస్సును జ్ఞానజ్యోతిని చూచి అపరమితానందమును చెంది బాలునిచేరదీసి జ్ఞానోపదేశమును చేసిన పిమ్మట సన్యాసమును ప్రసాదించి అనుగ్రహించి ఆశీర్వదించెను.

శంకరుడు ఆ గురువరేణ్యునివద్ద జ్ఞానమార్గము సిద్దించువరకు ఉండెను. పిమ్మట కాశీకి చేరెను.

ఆచార్యులు వారణాశి చేరినప్పుడు ఉత్తర భారతదేశమున హిందు మతము చాలా క్షీణావస్థ యందుండెను. అక్కడ బుద్దభిక్షుకుల ప్రచారముల వలన యాగాదిక్రతువులు అంతమొందుచుండెను. అట్టి తరుణమున ఆచార్యుల వారు జ్ఞానకాండను ప్రచారమును సలుపుచు హిందూమత స్థాపనకు బద్ద కంకణమును కట్టుకొనిరి. కాశీయందుండు గొప్ప పండితోత్తములతో వాద ప్రతివాదములను సలిపి వారిని మెప్పించి దేశమున సుప్రసిద్దుడాయెను. వీరు కాశీ క్షేత్రమునందుండి బ్రహ్మసూత్రం, దశోపనిషత్తు, భగవద్గీత ఈ మూడు గ్రంధములకు భాష్యం వ్రాసిరి. ప్రస్థానత్రయి అను ఈ మూడు గ్రంధములకు భాష్యం వ్రాసినవారినే ఆ కాలమున మతస్థాపకులుగ పరిగణించుచుండిరి.

ఈ శంకరభాష్యములే వీరి అఖండజ్ఞానశక్తికి నిదర్శనములు.

శంకరుడు కాశీనుండి ప్రయోగకు వెళ్లిరి. అక్కడ బౌద్ధమత విధ్వంసుకు డగు కుమారిలభట్టును దర్శించెను. హిందూదేశమునందుండిన పండితోత్తముల నందరిని దర్శించి వార్లతో శాస్త్రచర్చలు జరిపి ఓడించవలయున నేదే వీరి ఆశయము. కుమారిల భట్టు శిష్యుడగు మండనమిశ్రుని, వీరి భార్య, సరస్వతీదేవితో సమానురాలైన భారతీదేవిని దర్శించిరి. వీరిరువురను ఓడించి దిగ్విజయమును పొందిరి. పరాజయమును పొందిన మండనమిశ్రుడు స్వాములవారి శిష్యబృందమున చేరి సన్యాసమును స్వీకరించిరి. పద్మపాదుడు,

మండనమిశ్రుడు మొదలగు శిష్యులను వెంటబెట్టుకొని దేశ సంచారమును సల్పి పండితులనందరిని మెప్పించి దిగ్విజయమును బొందిన తర్వాత స్వామి శృంగేరి చేరిరి. ఆచార్యులు శృంగగిరి చేరినప్పుడే తల్లి ఆర్యాదేవి చరమ శయ్యపై పరుండి తన్ను స్మరించుచున్నట్లు జ్ఞానదృష్టితో గ్రహించినవాడై స్వగ్రామమగు కాలడికి మరలివచ్చి తల్లిని దర్శించెను. కుమారుని చూచి తల్లి సంతసించి మరణించెను. అప్పుడు కుమారుడు తల్లిని స్మశానమునకు తీసుకొనిపోయి కర్మక్రియలను జరపవలసివచ్చి స్వజాతి నంబూదిరీ బ్రాహ్మణులను పిలిచి తనకు సహాయపడమని వారిని కోరిరి గాని వారెవరును వీరికి సహాయపడక నిరాకరించిరి. ఏలననగా శంకరుడు సన్యాసి అగుటవలన వీరికి మాతా పితృ కర్మలను ఆచరించు అధికారము లేదు. మరియు వీరు బ్రహ్మచారిగ నుండి సన్యసించినది శాస్త్ర విరుద్ధమని కక్షకట్టి శంకరుని వెలి వేసి సహాయ నిరాకరణమును సాగించిరి.

ఈ సమయమున తల్లి శవమును ముందు బెట్టుకుని యెంత కాలముండ గలడు ? ఇంట తోడు మరి యెవరు లేరు. తానొక్కడు శవమును కాటికి మోసుకొని పోవునంత శక్తి లేదు. అప్పుడు శంకరుడు తోటలోనున్న అరటి మాకులను నఱికి కాష్టమును పేర్చి అందుపైన తల్లి శవమునకు అగ్నినుంచెను. వర్షము కురియుచున్నందునను మాకులు పచ్చివైనందునను అగ్ని చల్లారు చుండెను. అప్పుడు శంకరుడు అగ్నిదేవుని ప్రార్థించెను. అగ్ని భగ్గున మండి తల్లి దహనమాయెను. ఈ చిత్రమునంతయు చూచుచు వారి యింటి యెదుట నిలుచున్న స్వజాతి బ్రాహ్మణులందరు ఆశ్చర్యపడి శంకరుని తపో బలమునకు మెచ్చుకుని, శిష్యులయిరి.

కేరళ దేశమున చచ్చిపోయిన వారిని తమ ఇండ్ల తోటలలో దహనము చేయుట ఇక్కడి వారికి అమంగళముగాని భయముగాని లేదు. దహనము వేసిన స్థళమును పవిత్రముగ నుంచి ఒక సంవత్సరము వరకు అక్కడ దీపా రాధనను చేయుచు మ్రొక్కుచుండెదరు. ఆ స్థళమున ఫల వృక్షమును గూడ నాటి పెంచెదరు. మన తెలుగుదేశమునను చెట్టు నాటవలయునని యున్నది. కాని సామాన్యముగ శ్రద్ధలేక, అర్థము తెలియక జమ్మిరెమ్మ తెచ్చి గ్రుచ్చుదురు. ఆ ఓపికయు లేనివారు ప్రత్యామ్నాయముగ నొక దర్భపోచన నిలువ బెట్టు దురు. అది అప్పుడే గాలికి కొట్టుకొనిపోవును. మృతి చెందినవారి స్మృతి చిహ్నముగా పచ్చని చెట్టు నాటి పెంచుట - ఉత్తమోత్తమ ధర్మము. హిందూ ధర్మ మందిమిడి యున్నది. ఇక్కడ చచ్చినవారిని పెద్ద అరటి ఆకులో పరుండబెట్టి పిమ్మట దానిని ముక్కలుగ నఱికి అగ్ని యందుంచెదరు. అరటి

కాయనుకూడ ముక్కలుగ నఱికి కాష్టమందుంచు ఆచారమిప్పటికిని అమలు నందున్నది.

తల్లి కర్మ కాండనంతయు ముగించుకొని రెండవసారి దేశయాత్రకు శిష్యులతో కూడ పయనమాయెను. ఈ యాత్రలో మొదట కాశ్మీరమునకు వెళ్లిరి. అక్కడుండు పండితులనందరిని జయించి అక్కడ స్వామి సర్వజ్ఞ పీఠారోహణ పదవిని పొందిరి.

ఆచార్యులు మొదట శృంగేరికి పోయినప్పుడే అక్కడ మఠమును స్థాపించి, తన శిష్యవర్గంలో నొకరగు సురేశ్వరాచార్యులవారిని ఆ మఠాధిపతిగ నుంచిరి.

పిమ్మట జగన్నాథం, ద్వారక, బదరికాశ్రమం ఈ స్థలములలో ఆచార్యులు మఠములను స్థాపించి ఆమఠములకు త్రోటకాచార్యులను. హస్తామలకుని, పద్మ పాదను పైమూడుమఠముల అధికారులుగ నియమించి, హిందూమతస్థాపనా నంతరము స్వాములవారు స్వదేశమునకు మరలిరి. స్వస్థానమగు కాలడి గ్రామమునకు సమీపమునయున్న తిరుచూరుకు చేరిరి. అక్కడ బ్రహ్మ పాదముల చేరిరని ప్రమాణము. నిర్యాణమునకు పూర్వమే తిరుచూరులో నాలుగుమఠములను స్థాపించిరి. వాటిలో బ్రహ్మస్వమఠమునందు ఇప్పుడు కూడ విద్యార్థులకు సంస్కృతమును గఱపి భోజనమును పెట్టుచున్నారు. పరస్థానీకులెవరైన వచ్చినను ఈ మఠమునందు భోజనవసతి గలదు. ఆచార్యుల వారు బ్రహ్మస్వమఠమునందు 32వ సం॥ మున స్వర్గస్థులయిరి. వీరి శవమును తిరుచూరులోయున్న వడకున్నాధ శివక్షేత్రమున దహనము చేసినట్టు ఆ దేవా లయములో ఒక ఆనవాలుగలదు. ఈ దేశమున సన్యశించినవారిని శివుని దేవాలయములలో దహనముచేయు ఆచారముగలదు.

శ్రీ ఆదిశంకరులవారు కాశ్మీర దేశమునకు పోయినప్పుడు హిందూమత స్థాపనానంతరము శ్రీనగరమునకు 85 మైళ్లదూరమునుండు 6000 అడుగుల యెత్తుగల పర్వతమున తపస్సును చేయుచుండిరి. ఈ గిరిని శంకరాచార్యుల గిరి అనెదరు. ఆపర్వతాగ్రమున శంకరులవారు శివాలయమును స్థాపించిరి. ఈ దేవునిపేరు అమరనాధుడు. ఇక్కడ శంకరులవారు తపస్సుచేసిన గుహకలదు. వీటిని ప్రతి సం॥మును దర్శించి పూజించుటకు లక్షలాది జనులు యిప్పటికిని వచ్చుచున్నట్లు 1948 సం॥ ఆగష్టు 22వ తేది మద్రాసు హిందూపత్రికలో వ్రాసివున్నారు. యాత్రికులు ఈ పర్వతారోహణకు కాశ్మీరపు సర్కారు వారు కావలసిన సౌకర్యములను వసతులను యేర్పాటుచేయుచున్నారు.

ఈ సందర్భమున మద్రాసులోని శవదహన కష్టములనుగూర్చి నా అనుభవమును కూడ వ్రాయుచున్నాను.

మద్రాసులో పీనుగులను మోయు వృత్తి నవలంబించిన వాహకుల జట్టు గలదు. అందరికినివలెనే దానికిని ఒక సమితి గలదు. ఈ సమాజము వారందరు యెందుకు పనికిరాక కడపట పీనుగులమోయు వృత్తిలో చేరినవారు. వీరు మద్రాసులో అక్కడక్కడ నిర్ణయస్థళములలో నిలుచుకొని పిలుపులకు నిరీక్షించుచుందురు. కర్మకాండను జరిపించు పౌరోహితుడుపోయి ఒక జట్టును చచ్చినవారింటికి పిలుచుకొని వచ్చును. ఈ పౌరోహితునకు వీరందరు పరిచయస్తులే. వచ్చిన వాహకుల చచ్చినవారిని చూచి బేరముపెట్టెదరు. ధనవంతుడై లావుగానుండిన వాహకుల పంట పండినదే. ఒక జట్టు వచ్చిన చోటికి మరియొక జట్టు రాకూడదను కట్టుబాటు వీరికిగలదు. ఈ వాహకుల అడిగినంతడబ్బు యివ్వలేక పోయినను వారిని పిలుచుకవచ్చిన పౌరోహితులు తీర్మానించిన ప్రకారము వారు సమ్మతించి, శవమును లేవదీసుకొని పోయెదరు. ఈ పౌరోహితుని దయ వీరికి కావలసియుండును. వీరికిందులో కమీషన్ కూడ నున్నది. గనుక కేరళదేశాచారము చాల సుళువుగానున్నది.

శవమును దహనముచేయుట మంచి పద్ధతియని ఇప్పుడు పాశ్చాత్యులు నాజూకైన పద్ధతి నొకదానిని కనిపెట్టిరి. ఒక పెట్టెలో శవమునుంచి తలుపును మూసి ఎలక్ట్రిక్ స్విచ్చిని వేసిన నిముషములో శవము భస్మమైపోవునట. ఈ పద్ధతి మనదేశములో అమలునందుంచిన ప్రజల కష్టములు పోగలవు.

## కాలడి క్షేత్రము

కాలడిక్షేత్రము ఆదిశంకరుల జన్మస్థలము. చిన్నగ్రామమైనను రమణీయ మగు వృక్షరాజములమధ్య పెరియారను పేరుగల నదీతీరమున వెలసి ఉన్నది. అక్కడ శంకర శారదా దేవులను ప్రతిష్టించిన చిన్న దేవాలయములు గలవు. శంకరాచార్యుల తల్లిని దహనము చేసిన స్థళమున తులసికోట గలదు. సంస్కృత విద్యార్థులకు పాఠశాల గలదు. యాత్రికులకు ధర్మశాల గలదు. ఈ క్షేత్రమునకు పోవలసినవారు మద్రాసునుండి కొచ్చిన్ ఎక్స్ప్రెస్సులో యెక్కి అంగమాలి అను రైలుస్టేషన్‌లో దిగి కాలడికి పోవలయును. లేదా తిరుచూరునుండి బస్సులో యెక్కిన కాలడిలో దిగవచ్చును. ఈ కాలడి క్షేత్రము తిరువునంతపుర సంస్థానమునకు చేరినది. వేసవికాలమున కాలడి గ్రామము చల్లగనుండును. నదీస్నానము అన్నిరోగములను కుదర్చునని

ప్రతితి గలదు. నేను తిరుచూరు మకాములో యున్నప్పుడు అప్పుడప్పుడు కాలడికి పోవుచుందును.

## కేరళదేశ పుట్టు పూర్వోత్తరములు

పరశురాముడు క్షత్రియుల నందరిని వెతకి సంహరించిన అనంతరం ఆ పాప పరిహారార్థము బ్రాహ్మణులకు భూదాన మొనర్పవలయునని యోచించెనట. ఈ ధర్మబుద్ధితో పరశురాముడు పశ్చిమ సముద్రతీరమున నుండు ఒక పర్వతాగ్రమునుండి తన దివ్యాయుధమగు గండ్రగొడ్డలిని విసిరి సముద్ర మధ్యమునవేయగా ఆజలములలో నుండి కొండలు, గుట్టలు, చెట్టుచేమలు, నదులు, దొరువులు, పాములు, మృగములు మున్నగు వానితోగూడ భూమి పెల్లగిల్లి పైకుబికినది. అవిధముగా గొడ్డలి దెబ్బకు పాతాళలోకమునుండి ప్రతిధ్వని చేయుచు పైకుబికిన భూభాగమే కేరళదేశము.

ఇట్లు బయలుపడిన నిర్జనప్రదేశమగు అరణ్యప్రాంతమును బ్రాహ్మణులకు దానమిచ్చు సంకల్పముతో పరశురాముడు ఆర్యావర్తమునుండి కొందరు బ్రాహ్మణులను రావించి వారికట్లే దానిని దానమొనర్చెను. అయితే ఆ వచ్చిన బ్రాహ్మణులు, క్రూరమృగములకు, ఘోరసర్పములకు ఝుడిసి సమీపస్థమై యున్న కొంకణమునకు పారిపోయిరట. వారే నేడు సారస్వత బ్రాహ్మణులు అని పిలువబడు అందమైనజాతి.

పరశురాముడు రెండవసారి భక్తాగ్రేసరులు, పండితులు. మంత్రశాస్త్ర వేత్తలునైన బ్రాహ్మణులను ఆర్యావర్తమునుండే తిరిగి రావించి వారికాభూమిని దానమొసగెను. రెండవసారివచ్చిన బ్రాహ్మణులు తపస్సంపన్నులు, మంత్ర వేత్తలు గావున మృగసర్పబాధలకు జంకక వానిని వశమొనర్చుకొని అక్కడనే స్థిరనివాస మేర్పరచుకొనిరి. ఇట్లు రెండవసారి వచ్చినవారే నంబూదిరీ బ్రాహ్మణులు.

ఈ గాథలు సామాన్యముగా కేరళమున చెప్పుకొనబడుచున్నవి. ఐతే కేవలము ఇవి నిరాధారమగు పుక్కిటి పురాణములు గావు. మళయాళ దేశమందలి ఇతిహాసములును, కొన్ని ఈ కథలనే మార్చి చెప్పుచున్నవి.

కేరళోత్పత్తి, కేరళ మహాత్యము అనురెండు ఉద్గ్రంథములలోను నంబూదిరీలు పరశురాముడు ఆర్యావర్తమునందలి పలుతావులనుండి తీసుకొని వచ్చిన బ్రాహ్మణులు' అని చెప్పబడియున్నది. అయన వీరిని 64 గ్రామములలో నిల్పెనట.

(ఇంకా వుంది

